# కావ్య స్వరూపమ్

## ఆంధ్ర వివరణ సమేతము

సంపాదకౌ:

శ్రీ స్వామి శివ శంకర స్వామీ

ఆచార్యశ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్య శాస్త్రీ




ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ

కళాభవనము, సైఫాబాదు, హైదరాబాదు-4.

# స మ ర్ప ణ ము

సంస్కృత భాషా సాహిత్యములకు

**దోహదము** సమకూర్చు

*మాన్యశ్రీ బెజవాడ గోపాల రెడ్డి గారి*

*కరకమలాంజలిలో*

# తొలి పలుకు

నేటికాలమున ఆంధ్రభాషా సాహిత్యములు బహుముఖముల విస్తరించుచున్నవి. వానితో పాటుగా సాహిత్యవిమర్శనమును వర్ధిల్లుచున్నది ఆధునిక విమర్శకులు ఎక్కువమంది పాశ్చాత్య విమర్శనా పద్ధతులచే ప్రభావితులై యున్నారు. కొందరు ప్రాచీన భారతీయ పద్ధతులమీదనే మొగ్గుచూపుచున్నారు. కొందరు రెండిటి నిజస్వరూపము తెలియక కలగాపులగము చేయుచున్నారు. అందువలన సాహిత్య విమర్శలోనను రచనలోనను అవ్యవస్థ ఏర్పడుచున్నది. అట్టిది నివారించి ప్రాచీన పాశ్చాత్య పద్ధతులను, ప్రాచీనాధునిక భావములను సమన్వయించి సహృదయ సంభావ్యమై పటిష్ఠమైన సద్విమర్శలు చేయగల విమర్శకాగ్రేసరులు మన కిప్పుడెంతయు నవసరమై యున్నారు

భరతభూమిలో కావ్యస్వరూపమును పూర్వము పరామర్శ చేసిన గ్రంథములు ఎక్కువ భాగము సంస్కృత భాషలోనే కలవు, దేశభాషలలో కొలది గ్రంథము లున్నను, అవి యన్నియు ప్రధానముగా సంస్కృత గ్రంథములమీద నాధారపడినవే. సాహిత్యస్వరూపమును వివేచించుటకు కృషి చేసిన సంస్కృత రచయితలలో గూడ ఎన్నో మతభేదము లున్నవి. అందువలన "కావ్య స్వరూప" విచారణ చేసిన ప్రాచీనాలంకారికుల ప్రధాన మతములను సంక్షేపముగా సంస్కృతమూల భాగములను ఆంధ్రవివరణముతో క్రోడీకరించి షుమారు 200 పేజీల గ్రంథముగా ప్రచురించుట విద్వాంసులకును, రచయితలకును, విమర్శకులకును, సహృదయులకును, ఎంతయు ప్రయోజన కారిగా నుండునని ఆంధ్రప్రదేశ్ సాహిత్య

అకాడమీవారు నిర్ణయించిరి. ఆ నిర్ణయము ననుసరించి ఈ గ్రంథము ప్రకటించుచున్నందుల కెంతయు ఆనందించుచున్నాము.

ఈ గ్రంథము సంకలనము చేసి వివరణములు వ్రాయు భారము విశ్వసాహిత్య నిష్ణాతులైన శ్రీ స్వామీ శివశంకరస్వామి వారికి అప్పగించితిమి. వారు డాక్టరు పోతుకూచి సుబ్రహ్మణ్య శాస్త్రి, M.A., M. Litt., Ph.D., D.Litt., తో కలసి సంతరించి మాకు నిర్దిష్టపరిమితితో సకాలమున నందజేసి నందులకు వారికి అకాడమీ పక్షమున కృతజ్ఞతలు తెలుపుచున్నాము.

ఋగ్వేదకాలమునుండి జగన్నాథ పండిత రాయలవరకు మనదేశములో కావ్య స్వరూపమునుగూర్చి ప్రవర్తిల్లిన భావములును సిద్ధాంతములును ప్రధానమైన వన్నియు ఏకత్ర ఈ గ్రంథ రూపములో ప్రకటించుచున్నందులకు ఆంధ్ర పాఠకలోకము సమ్మోద మందగలదని ఆశించుచున్నాము.

దేవులపల్లి రామానుజరావు.

హైదరాబాదు
21-7-69

# విషయానుక్రమణిక


| | | పుట |
|---|---|---|
| | అంకితము .... .... | v |
| | తొలిపలుకు .... .... | vii |
| | ప్రస్తావన .... .... | xi |
| 1. | ఋగ్వేదము .... .... | 1 |
| 2. | ఉపనిషత్తు : .... .... | 3 |
| 3. | వాల్మీకి రామాయణము .... .... | 9 |
| 4. | అగ్ని పురాణము : .... .... | 11 |
| 5. | భరతుని నాట్య శాస్త్రము .... .... | 14 |
| 6. | భామహాచార్యుడు : కావ్యాలంకార సంగ్రహము .... | 21 |
| 7. | ఆచార్య దండి : కావ్యాదర్శము .... .... | 25 |
| 8 | రుద్రటుడు: కావ్యాలంకారము .... .... | 36 |
| 9. | వామనాచార్యుడు : కావ్యాలంకార సూత్రవృత్తి .... | 39 |
| 10 | ఉద్భట భట్టు: కావ్యాలంకార సంగ్రహము .... | 47 |
| 11. | భట్ట లోల్లటుని మతము .... .... | 50 |
| 12. | ఆనంద వర్ధనాచార్యుడు: ధ్వన్యాలోక కారికాదులు.... | 51 |
| 13. | ముకుల భట్టు: అభిధావృత్తి మాతృక .... | 72 |
| 14. | ఆచార్య శంకుక మతము .... .... | 74 |
| 15 | రాజశేఖరుడు: కావ్య మీమాంస .... .... | 76 |
| 16. | భట్టనాయకుని మతము .... .... | 80 |
| 17 | భట్ట తౌత మతము .... .... | 86 |
| 18 | ధనంజయుడు - ధనికుడు : దశరూపకము .... | 88 |
| 19 | అభినవగుప్త పాదాచార్యుడు: లోచనము; అభినవభారతి | 96 |

20 ఆచార్య కుంతకుడు : వక్రోక్తి జీవితము .... 110

21 క్షేమేంద్రుడు: ఔచిత్య విచార చర్చ .... 119

22. భోజదేవుడు : సరస్వతీ కంఠాభరణము : .... 127

23. మమ్మటాచార్యుడు: కావ్యప్రకాశము .... 134

24. శారదాతనయుడు : భావప్రకాశము .... 139

25. ఆచార్య హేమచంద్రసూరి : కావ్యానుశాసనము .... 144

26. రుయ్యకాచార్యుడు : అలంకార సర్వస్వము .... 149

27. విద్యానాథుడు : ప్రతాప రుద్రీయము .... 155

28. విశ్వనాథ కవిరాజు . సాహిత్యదర్పణము .... 161

29 శ్రీమ దప్పయ దీక్షితులు: చిత్రమీమాంస .... 170

30 పండితరాజ జగన్నాథుడు . రస గంగాధరము .... 174

## అనుబంధము

1. శ్రీ రాజానక మహిమ భట్టు .... 188

2. విద్యాధర కవి .... 199

3. సింగ భూపాలుడు .... 201

4. శ్రీ రూప గోస్వామి .... 205



# ప్రస్తావన

---

అలంకార శాస్త్ర గ్రంథములు గీర్వాణ భాషలో నెన్నో కలవు. కావ్యహేతువులు, లక్షణము, కవిశిక్ష, గుణ దోషములు, శబ్ద - అర్థ - మిశ్రాలంకారములు, రసము, మొదలగు విషయముల చర్చ వానిలో కానవచ్చుచుండును కొన్ని గ్రంథములలో నాయక లక్షణములు, నాటకస్వరూపము, కావ్యభేదములు నిరూపితము లగును రీతి, వక్రోక్తి, ధ్వని, ఔచిత్యము, ధ్వనిఖండన మండనములు మరికొన్నిటిలో కన నగును. ఈ విషయము లన్నియు కవిత్వతత్త్వమునకు కావలసినవే.

ఎన్నో గ్రంథములు పఠించిన గాని అవగతములు కాని విషయముల నేకసంపుటిలో సంగ్రహరూపమున జూపినచో విద్యార్థులకు, విమర్శకులకు, రచయితలకు సంస్కారము కలపాఠకులకు నుపకరించునని యీ సంకలనము చేయుట సంభవించినది. సామాన్య సంస్కృత భాషా జ్ఞానము కలవారి కిందలి విషయములు బోధపడును. సమగ్రజ్ఞానము కొరకు సంస్కృత మాతృకలను పఠించి మననము చేయవచ్చును.

ఇందలి సంస్కృత పంక్తులను దేవనాగరలిపిలోను, అవతారికాదులను ఆంగ్లములోను సమకూర్ప దలచితిని. కాని మనదేశీయుల మనస్తత్త్వమును బట్టి, ఆంధ్రలిపిలోను, ఆంధ్రవివరణములతోను తుదకు సిద్ధము చేసితిని.

విషయవివరణము సంగ్రహముగానే తెలుప నెంచితిని. కొన్నియెడల విషయ భారమును బట్టి కొంతవిపులవివరణము తీయక తప్పలేదు.

గ్రంథ వివరణము విపులముగా నున్నచో బాగుండెడి దని భావించు పాఠకు లుండవచ్చును. వారు ఆంధ్రీకృత-అలంకార-గ్రంథములను పఠిం

చుట మేలు. ఎందరో పెద్దలు అలంకార శాస్త్రములోని ప్రధానగ్రంథము లన్నింటిని ఆంధ్రీకరించి ప్రకటించినారు.

భారతీయ నాట్యశాస్త్రములోను అగ్నిపురాణమునను కావ్యనాటకాది విషయములకు సంబంధించిన యధ్యాయము లన్నిటిని అనుబంధములుగా నీయ దలచియు, గ్రంథవిస్తరభీతిచే విరమించితిని.

ఆంధ్రులకు సంస్కృతాలంకారికుల గ్రంథము లన్నిటినుండియు ఉచితభాగములను సమకూర్చ నెంచియు, విశిష్టత లేదనియు, గ్రంథము పెరిగిపోవు ననియు మానితిని.

ధ్వని ధ్వంసక గ్రంథ మగు వ్యక్తివివేక భాగములు హెచ్చుగా నీయ దలచితిని. కాని తర్కశాస్త్రజ్ఞాన మున్నవే ఆపంక్తులు బోధపడును. పైగా అందలి విధానము వ్యతిరేకమే కాని అన్వయము కాదు. "అన్వయ వ్యతిరేకాభ్యా మర్థసిద్ధిః." అయినను ప్రత్యేక గ్రంథరచనమే యందుకు తగినదని విరమించినాను.

"ఉజ్జ్వల నీలమణి" కేవల మలంకారశాస్త్ర గ్రంథము కాకున్నను, రసవిషయమున కొన్ని విశేషములు వివరించుటచేతను, వంగదేశమున అలంకారగ్రంథముగా ప్రతిష్ఠ యుండుటచేతను తద్భాగము లిందు చేర్చినాను.

శబ్దమునకు వ్యాకరణము, అర్థమునకు తర్కము అవసరములు. ఏశాస్త్రము నభ్యసింపవలె నన్నను తర్కశాస్త్ర మెంతో ప్రధానము. ధ్వన్యాలోక కర్త యయిన ఆనందవర్ధనాచార్యు నంతటివానిని జయంత భట్టు పండితమ్మన్యు డన్నాడు! జయంతుడు మహానైయాయికుడు, న్యాయమంజరీ కర్త.

మహోపాధ్యాయ జమ్ములమడక మాధవరామశర్మగారు అనుబంధములోని గ్రంథభాగములు కొన్ని సమకూర్చినారు. ఆచార్య శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు (M.A.,M.LITT ,Ph.D.,D.LITT., DIP. IN GERMAN) గ్రంథములో అర్థభాగము నంతరించి యిచ్చినారు. ఉభయులును అభినందనీయులు.

R P. COWL మహాశయుడు కవితాతత్త్వమును గూర్చిన ఆంగ్లగ్రంథమును 1915 లో నేను పఠించినాను. అందులో ఐరోపియ తత్త్వవేత్తలు, విమర్శకులు, రచయితలు, కవులు వెలువరిచిన మతము లను కౌల్ క్రోడీకరించినాడు. అటువంటి గ్రంథమును సంస్కృతములోను ఆంధ్రములోను సమీకరింప వలె నని తలచితిని. కాని గత సంవత్సరము వరకు అవకాశము కలుగలేదు. సాహిత్య అకాడమీ అధ్యక్ష కార్యదర్శుల ప్రోత్సాహమువలన దీనికి ప్రణాళిక యేర్పరించి యీవిధముగా సంతరింప గలిగినాను.

మాన్యశ్రీ గోపాలరెడ్డి గారికిని అప్తులు శ్రీ రామానుజ రావు గారికిని కృతజ్ఞత తెలుపు చున్నాను.

స్వామి శివ శంకర స్వామి

సాహితీ సమితి, తెనాలి
సౌమ్య సంవత్సరాది,
మార్చి 19, 1969.

---

# కావ్య స్వరూపమ్



## ఋగ్వేదము

సంహితలలో ఋషులు కావ్యస్వరూపమును వివరించి యున్నారు. యజ్ఞాన్నమువలె క్రొత్తసూక్తమును వసిష్ఠుడు రచింపగా (ఋ వే 7 86 2). భృగువులు రథమును చెక్కినట్లు ఇతర ఋషులు గీతములను చెప్పిరి (10 29 14) హంసల పాటలవలె శ్లోకమును చేసి పాడవలెనని (8 58.10) ఆదేశము అశ్వినుల నుద్దేశించి చెప్పిన సూక్తమును భార్య నలంకరించు విధముగా ఒక కవి అలంకరించినాడు (10 19 14) పదముల కూర్పు. ఔచిత్యము, విశిష్టార్థము, అలంకరణ కవితలో ఉండవలెనని భావించి ప్రతిభావ్యుత్పత్తుల ఆవశ్యకతను అంగీకరించిరి. మనస్సును విప్పిచెప్పు చుంటి మని, హృదయ పూర్వకముగా పల్కుచుంటి మని అనేక స్థలము లలో వైదికకవు లన్నారు.

భావరూపముల సమ్మేళనమును గూర్చి పలుకు వాక్యములు చాల గలవు (8 84 2 2 42.1 6 47 3) కవిత్వము దేవ ప్రసాదఫల మని పడవను నడపురీతిగా ఈ ఆవేశమును తెచ్చు దేవతయే గీతక్రమమును దిద్ది, దారి చూపు నని కలదు సూక్తము జన్మించున దనియు సృష్టింప బడున దనియు పలుతావుల పల్కినారు తన హృదయమును విప్పి చెప్పుకొనుటకు కవిత్వమే ఆధార మగుటచే ఈ భారమును సంతోషముతో కవి గ్రహించెను వ్యవహారమున గల పదజాలమును శోధించి, పడపోసి, కావ్యమున కుపయోగించుట ఆచారముగా కన్పట్టు చున్నది. మధు చ్ఛందో భనతి రేభా ఇష్టౌ (6 11 3)—తీయని కవితను చెప్పినాడు. ఇంకొకచోట తన కావ్యములో తీయని మాటలు గల వనిరి (8 3 15)

ఋగ్వేదఋషులకు రస ధ్వని సిద్ధాంతములు ఆలంకారికవాదములు క్రొత్తవి కావు తర్వాతి కాలమున వచ్చిన సాహిత్య శాస్త్రములోని వాదము లనేకములు వైదిక వాఙ్మయమున సూచింపబడి యున్నవి.

దేవీం వాచ మజనయంత దేవా
స్తాం విశ్వరూపాః పశవో వదంతి
సా నో మంద్రే షమూర్జం దుహానా
ధేను ర్వా గస్మా ముపసుష్టు తైతు 8 100 11

వాగ్దేవిని దేవతలు సృష్టించిరి పలురకముల పశువులు ఆమెను ఉచ్చరించును ఆహ్లాదకారి యగు వాగ్ధేనువు, ఆహారమును శక్తిని ఇచ్చుచు మాచే చక్కగా స్తుతింపబడినదై మమ్ము చేరు గాక!

కనిక్రదజ్జనుషం ప్రబ్రువాణ
ఇయర్తి వాచ మరితేవ నావమ్ 2 42 1

మాటిమాటికి శబ్దము చేయుచు ఉత్పన్నము కాబోవు అర్థమును పలుకుచు నావను కదపు రీతిగా వాక్కు ప్రేరేపించుచున్నాడు

ముఖస్య తే తవ విషస్య ప్ర జూతి
మియ ర్మి వాచ మమృతాయ భూషణ 8 84 2

ఇంద్రా నిన్ను అలంకరించుచు మహనీయము (స్తుత్యము), బల సమన్వితము నగు నీ స్వభావమును మనస్సుచే ప్రేరేపింపబడిన సూక్త లక్షణ మగు వాక్కుతో అమృతమునకై ప్రేరేపించుచున్నాను

హంసా ఇవ కృణుథ శ్లోక మద్రిభి
ర్మదంతో గీర్భి రధ్వరే సుతే సచా. 3 53 10

యజ్ఞమున సోమమును తీయుచు స్తోత్రములతో దేవతలను ఆనందింపజేయుటకు హంసలవలె శ్లోకములను రచింపుడు.

ఏతం వాం స్తోమ మశ్వి నావకర్మా—
తక్షామ భృగవో నరథమ్
న్యమృక్షామ యోషణాం నమర్యే
నిత్యం నసూనుం తనయం దధానాః 10 39 14

అశ్వినుల కీ స్తుతిని చేసితిమి భృగువులు రథమును మలచినట్లు మలచితిమి ఔరసపుత్రుని గర్భమున మోయుచున్న స్త్రీని భర్త ఆదరించు విధముగా ఈ సూక్తమును నియమపూర్వకముగా శోధించితిమి

చత్వారి వా క్పరిమితా పదాని
తాని విదు ర్బ్రాహ్మణా యే మనీషిణః
గుహా త్రీణి నిహితా నేంగయంతి
తురీయం వాచో మనుష్యా వదంతి   1 164 45

భాషను నాల్గు భాగములు చేసినచో ఈ నాలుగు భాగములు భావన గల కవికి అవగతములే అగును కాని వీనిలో మూడు భాగములు గుహలో దాగి కదలికను తీసికొనిరాక యున్నవి నాల్గవ భాగమునే మానవు లీలోకమున ఉపయోగింతురు (జగద్రహస్యములను అభివ్యక్తము చేయురీతిగా కవి ఒక్కడే భాషను ఉపయోగింపగలడు ఇచట కవి భావనాశక్తి (మనీషా) చెప్పబడుటయే గాక, తర్వాతి వ్యాకర్తలు అలంకారికులు చెప్పిన పరా పశ్యంతీ మధ్యమా వైఖరి అను వాగ్రూపములు కూడ ప్రస్తుతింపబడినవి)

ధేనుం న త్వా సూయవసే దుదుక్షో
న్నుప బ్రహ్మాణి సస్పృజే వసిష్ఠః   7 18 4

చక్కని పచ్చిక బయలులో నున్న ఆవు పాల నిచ్చువిధమున వసిష్ఠుడు సూక్తములను సృష్టించి ప్రవహింప జేసెను.

బృహస్పతిః 10 71.

1. బృహస్పతే ప్రథమం వాచో అగ్రం
యత్ ప్రైరత నామధేయం దధానాః
య దేషాం శ్రేష్ఠం య దరిప్ర మాసీత్
ప్రేణ్ణా తదేషాం నిహితం గుహావిః.

బృహస్పతీ నామధేయమును ధరించినదానిని మొట్టమొదట ఎవరు బయటకు పంపిరో వీనిలో ఏది శ్రేష్ఠము దోషరహితము బనదో, అది ప్రేమవలన గుహలో దాగియున్నను ఆవిష్కృత మైనది

(దాగియున్నది ఆవిష్కృతమగుట ధ్వనిలక్షణము ఈ ధ్వనివాదము వైదికవాఙ్మయమున గూడ కన్పించుచున్న దనుటకు ఈసూక్తము ప్రబల మగు ఆధారము)

2 సక్తు మివ తితఉనా పునన్తో
యత్ర ధీరా మనసా వాచ మక్రత
అత్రా సఖాయః సఖ్యాని జానతే
భద్రైషాం లక్ష్మీ ర్నిహితాధి వాచి

విజ్ఞులు తమబుద్ధిబలముతో గింజలను జల్లెడతో జల్లించి శుభ్రము చేయురీతిగా శబ్దములను జల్లెడపట్టి కవిత్వమును చెప్పుదురు అప్పుడు వీరికి సమానగువారు ఈ కవిత్వమును అవగాహన చేసికొందురు కనుక అట్టి కవితలో శుభప్రద మగు శ్రేయస్సు గలదు.

3 యజ్ఞేన వాచః పదవీ యమాయన్
తమన్వవిందన్నృషిషు ప్రవిష్టామ్
తామాభృత్యా వ్యదధుః పురుత్రా
తాం సప్తరేభా అభిసన్నవంతే

యజ్ఞముద్వారా వాక్కుయొక్క ఔచిత్యమును వారు తెలిసి కొనిరి అది ఋషులను ప్రవేశించిన దని గుర్తించిరి దాని గ్రహించి అనేక స్థలములలో దానిని విస్తరింప జేసిరి ఏడుగురు కవులు దీనిని పొగడు చున్నారు

4 ఉతత్వః పశ్య న్న దదర్శ వాచం
ఉతత్వః శృణ్వ న్న శృణో త్యేనామ్
ఉతో త్వస్మై తన్వం వి సస్రే
జాయేవ పత్య ఉశతీ సువాసాః

ఒకడు చూచుచున్నను వాక్కును చూచుట లేదు, వినుచున్నను వినుట లేదు ప్రేమించుభార్య చక్కని వస్త్రములను ధరించి భర్తకు స్వస్వ రూపమును అభివ్యక్తము చేయునట్లు, వేరొకనికి తనరూపమును వాక్కు వ్యక్తము చేయుచున్నది (తర్వాతి సమీక్షకులు కావ్యమును కాంతా

సంమిత మనినారు. చూచినను చూడకపోవుట విన్నను వినకపోవుట అను వానిద్వారా వీరు కవి అభిప్రాయమును అవగాహన చేసికొనలేనివా రని తెలియుచున్నది ఈఅభిప్రాయము వ్యంగ్యార్థ ము కాని, తాత్పర్యార్థ ము గాని కావచ్చును "చూచుట రూపకమును సూచించుపదము గాని లేక లిపికి సంబంధించిన మాట గాని అని చెప్ప వీ లున్నది)

5 ఉతత్వం సఖ్యే స్థిరపీత మాహు
రైనం హిన్వం త్యపి వాజినేషు
అధేన్వా చరతి మాయ యైష
వాచం శుశ్రువా అఫలా మపుష్పామ్

సఖ్యమున చక్కగా రక్షింపబడినవా డని ఆకవిని అందురు అతనికి యుద్ధములలోకూడ బాధ కలుగదు ఫలపుష్పములు లేని వాక్కును వినిన వాడు పాలనీయని ఆవువలె మాయలో సంచరించును (కవికి సంఘములో గొప్పస్థానముండెడిది )

6 య స్తిత్యాజ సచివిదం సఖాయం
న తస్య వాచ్యపి భాగో అస్తి
య దీంశృణో త్యలకం శృణోతి
న హి ప్రవేద సుకృతస్య పంథామ్

తనతో సమాన మైనజ్ఞానము గలసఖుని ఎవడు వదలి వేయునో, అతనివాక్కున కూడ ఆస్వాదింపదగిన దేమియు లేదు ఇత డేది వినునో అది అసత్యము అగుచున్నది. సుకృతమార్గము అతనికి తెలియదు.

7 అక్షణ్వంతః కర్ణ వంతః సఖాయో
మనోజవే ష్వసమా బభూవుః
ఆదఘ్నా స ఉపకక్షాస ఉత్వే
హ్రదా ఇవ స్నాత్వా ఉ త్వే దదృశ్రే

సమానము లైన కన్నులు చెవులు గల సఖులలో భిన్నము లగు మనో వేగము లున్నవి. కొన్ని సరస్సులలో నీరు రొమ్ముదవరకు కొన్నిటిలో

ముక్కు వరకు ఉన్న విధమున వీరిలో భేదము లున్నవి. కాని కొన్ని సరస్సులు లో తైనవి, స్నానయోగ్య మైనవి

8 హృదా తష్టేషు మనసో జవేషు
యద్బ్రాహ్మణాః సంయజంతే సఖాయః
అత్రాహ త్వం విజహు ర్వేద్యాభి
రోహ బ్రహ్మాణో విచరం త్యుత్వే

హృదయముద్వారా మలచబడిన సూక్తములు గలిగి, మనోవేగము గల సఖులు ఒకచో చేరి పూజింతురు అచట తెలిసికొనినవారిచే కుకవి పరిత్యజింపబడును నిజ మైన కవు లచట తిరుగుచుందురు

9 ఇమే యే నార్వా జ్న పర శ్చరంతి
న బ్రాహ్మణా సో న సు తేకరా సః
త ఏతే వాచ మభిపద్య పాపయా
సిరీ స్తంత్రం తన్వతే అప్రజజ్ఞయః

అదేవిధ మగు స్వేచ్ఛతోను గౌరవముతోను తిరుగ వీలు లేనివారిని కవు లను పేరుతో పిలువ రాదు వారు సోమరసమును తీయుటకు కూడ అర్హులు కారు వారు కవిత్వమును సరి యైనమార్గమున అర్థము చేసి కొనరు కనుక వారి కిష్ట మగురీతిగా అల్లికలను అల్లెదరు.

10 సర్వే నందంతి యశసా గతేన
సభాసహేన సఖ్యా సఖాయః
కిల్బిషస్పృత్ పితుషణి ర్హ్యేషాం
అరంహితో భవతి వాజినాయ.

తమ సభకు యోగ్యుడు అర్హుడు నైన సఖుడు వచ్చుటచే తమకు వచ్చిన కీర్తివలన అది వి సఖులు సంతోషింతురు ఇది దోషములను నశింప చేయునది సోమపానమును తెచ్చునది పూజలో తగినస్థానము అతనికి ఈయబడు చున్నది

11 ఋచాం త్వం పోష మాస్తే పుపుష్వాన్
గాయత్రం త్వో గాయతి శక్వరీషు

బ్రహ్మోత్వో వదతి జాతవిద్యాం
యజ్ఞస్య మాత్రాం విమిమీత ఉత్వః.

కవితలో అనేకము లైన అభివృద్ధులను తెచ్చి పూజలో పాల్గొనును. పాడుటకు తగిన సన్నివేశములలో వానిని కొందరు పాడుదరు కవి కూర్చుండి తాను రచించిన కవితను పాడును ఇతరుకు అనమయమున విధింపబడిన యాగప్రక్రియను సరిచూచును.

---

ఇంద్ర య స్తే నవీయసీం
గిరం మంద్రా మజీజనత్
చికిత్విన మనసం ధియం
ప్రత్నా మృతస్య పిప్యుషీమ్. 8 95 5

ఓ ఇంద్రా క్రొత్తది ఆహ్లాదకరము అగు సూ
చేసినాడు చక్కనిబుద్ధి నుండి వచ్చినది పురాతనము పవిత్ర మైన సత్య ముతో నిండినదియు అగు ఈ సూక్తము కావ్యనిర్మాణ శక్తినుండి ఉత్పన్న మైనది

---

కవిః కవిత్వా దివిరూప మాసజత్ 10 124 7

ద్యులోకమున తనరూపము కవిత్వ వశమున కవి స్థిరపరచినాడు

---

# ఉపనిషత్

ఉపనిషత్తులలో బ్రహ్మను నిర్దేశించు సమయములలో సత్యము జ్ఞానము అను పదములతోను సత్, చిత్ అనుశబ్దములతోను ఆనంద శబ్దముకూడ ఉపయోగించుట కలదు మిగిలిన శబ్దములకు దార్శనికమార్గమున అర్థము సుకరమే. కాని ఆనందశబ్దము కవిత్వాది లలితకళలలో కలుగు అనుభూతిని నిర్దేశించునది కావ్యమున ప్రధానముగా రసము కల దని ఈ రసాస్వాదము బ్రహ్మానుభూతికి తుల్య మైన దని తర్వాతి ఆలంకారికు లనిరి. వీరికి ఉపనిషత్తులలోని "ఆనంద' శబ్దమే గాక తైత్తిరీయమున

ఆనంద ఆత్మా (౨౬).

ఆనందమయ మాత్మానం (౨౮)

ఆను పంక్తు లున్నవి పైగా ఆనందవల్లిలో ఏడవ అనువాకమున-

రసో వై సః రసగ్ం హ్యే వాయం లబ్ధ్వా ఽఽనందీ భవతి

అని తైత్తిరీయశ్రుతి అద్వయబ్రహ్మమే రసము ఈ రసావగతిని పొందినవాడు ఆనందానుభూతిని పొందుచున్నాడు. ఇదే మహారసము. శృంగారాదులు దీని వివర్తరూపములు అందుచే "భగ్నావరణా చి దేవ రసః" అని జగన్నాథుడు పలికినాడు



# వాల్మీకి: రామాయణమ్

వాల్మీకి చెప్పిన రామాయణ కావ్యమున కవిత్వ మెట్లు ఉత్పన్న మైనదో గాథారూపమున వివరింపబడినది క్రౌంచవధ చేసిన నిషాదుని ఉద్దేశించి వాల్మీకి శ్లోకము పలికెను క్రౌంచపక్షి అనుభవించు వియోగము ఋషిని కలవరపెట్టుటచే అప్రయత్నముగా శ్లోకము వెలువడెను

మానిషాద ప్రతిష్ఠాం త్వ మగమః శాశ్వతీః సమాః
యత్ క్రౌంచమిథునా దేక మవధీః కామమోహితమ్

అను శ్లోకము ఆయన నోటివెంట వచ్చినది. పౌరుషేయ శ్లోకములలో ఇది మొదటిది అని సంప్రదాయము ఈ శ్లోకము కరుణరసానుభూతి వలన ఉత్పన్న మైనది.

పాదబద్ధో ఒక్షరసమ స్తంత్రీలయసమన్వితః
శోకార్తస్య ప్రవృత్తో మే శ్లోకో భవతు నాన్యథా

అని శిష్యునితో పలికెను నాల్గు పాదములతో సమానసంఖ్య గల అక్షరములతో, లయసమన్వితమై శోకానుభూతినుండి వచ్చినది శ్లోకమే అగు గాక అనినాడు తర్వాత బ్రహ్మ కన్పించి వాల్మీకికి ఇతివృత్తమును, దివ్యదృష్టి అనబడు భావనావ్యాపారమును ఇచ్చినట్లు కలదు

సమాక్షరై శ్చతుర్భిర్యః పాదై ర్గీతో మహర్షిణా
సో ఒను వ్యాహరణా ద్భూయః శోకః శ్లోకత్వ మాగతః

అప్పుడు మనోరమము లగు ఉదారవృత్తములతోను, ఉదారశబ్దార్థ ములతోను రాముని చరితను ఇట్టి శ్లోకములలో వ్రాయుటకు వాల్మీకి సంకల్పించెను.

ఉదారవృత్తార్థపదై ర్మనోరమై
స్త దాస్య రామస్య చకార కీర్తిమాన్ (1.2 42)

అర్థవంతములై వైచిత్ర్యము కలిగిన పదములతో (1 4 1) వాల్మీకి ప్రారంభించెను అప్పుడు ఆయన శృంగార, కరుణ హాస్య రౌద్ర, భయానక, వీరాది (1 4 10) రసములతో కూడిన కావ్యము నీయగల్గెను. అట్టి కావ్యము కవుల కాధార మైనకావ్యము

ఆశ్చర్య మిద మాఖ్యానం మునినా సంప్రకీర్తితమ్
పరం కవీనా మాధారం సమాప్తం చ యథాక్రమమ్ (1.4 26)

అందరి హృదయములకు ఆహ్లాదము నీయగల్గిన కావ్య మిది(1.4 34) ప్రత్యక్షముగా భాసించునట్లు కావ్యమును చెప్పినాడు (1 4.17) మాధుర్య గుణోపేత మైన దీకావ్యము (1 4 8 17) విచిత్రపదములతోను (1 4 1), విచిత్రార్థ పదములతోను (1 4 26) ఉన్నది ఆదికావ్యము.

---

# అగ్ని పురాణమ్

అగ్నిపురాణమున 337 - 347 అధ్యాయములలో కావ్యలక్షణ స్వరూపములు వివేచింప బడినవి రామాయణము హరివంశము పింగలచ్ఛందము గీత ప్రస్తుతింప బడినవి. అమరకోశమున కన్పించు శ్లోకములు కొన్ని ఇచట గలవు భారతీరీతి భరతునిచే చెప్పబడిన దనుటచే అగ్నిపురాణము భరతుని తర్వాత వచ్చిన దనవలెను నాట్యశాస్త్రములోని కారికలు ఈ పురాణమున కనిపించుచున్నవి రూపకము ఉత్ప్రేక్ష మొదలగు కొన్ని అలంకారముల లక్షణములు కావ్యాదర్శములో ఉన్నవిధముననే ఈయ బడినవి రూపకాక్షేపాదుల లక్షణములు భామహాలంకారమందలి లక్షణములను పోలియున్నవి ధ్వనివాదమును అలంకారములోని అంతర్భావమని యెంచిన అగ్నిపురాణము తొమ్మిదవ శతాబ్దాంతమునకు చెందిన దనవచ్చును.

శాస్త్రమున శబ్దప్రాధాన్యము, ఇతిహాసమున అర్థప్రాధాన్యము, కావ్యమున అభిధాప్రాధాన్యము గలవు అభిప్రాయమును వ్యక్తీకరింప జాలిన పదసముదాయము కావ్యమున నుండును ఈ పదములు దోషవర్జితములై గుణాలంకారయుతములు కావలెను మహాకావ్యమున అష్టాదశ వర్ణనలతో బాటు అన్ని వృత్తులు అన్ని ప్రవృత్తులు, అన్ని భావములు రీతులు, రసములు ఉండవలెను వాగ్వైదగ్ధ్యప్రధాన మైనను కావ్యమునకు రసమే జీవితము నాటకాదుల శరీరముగా ఇతివృత్తమును గ్రహింపవలెను

జ్యోతిస్స్వరూపమగు అద్వైతబ్రహ్మ సహజస్వభావము ఆనందము ఈ ఆనందము చైతన్యచమత్కార మగు రసరూపమున వ్యక్త మగుచున్నది దీని మొదటి వికృతిని అహంకార మందురు ఈ అహంకారము నుండి అభిమానము అందుండి రతి జన్మించుచున్నవి ఈ రతికి పరిపోషము కలుగగా శృంగారమని పిలువబడు చున్నది ఈ శృంగార భేదములే ఇతర రసములు. నీరస మగు వాణి ప్రకాశించ లేదు కనుక కావ్యమున రసము అత్యంత మవసరము కావ్యజగమునకు కవియే ప్రజాపతి. అందుచే

అతనికి ఏది ఇష్టమో దానిని అతడు సృజించును కవి శృంగారరస పరిపూర్ణుడైనచో కావ్యమున రసమయ మగు జగము కన్పింపగలదు కాని కవి శృంగారరసహీను డైనచో కావ్యము నీరస మగును భావహీన మైన రసము గాని రసములేని భావము గాని లేవు కనుక వీని కన్యోన్యసంబంధ మున్నది శాంతముతో కలిసి రసములు తొమ్మిది.

అలంకారములు కావ్యశోభా,రము లగు ధర్మములు అర్థాలంకారములు లేనిచో శబ్దసౌందర్య ముండ జాలదు అర్థాలంకారము లేని రచనలో వితంతువు పోలిక లుండును అలంకారములు గుణములు కావ్యమున ఉండి తీరవలెను

కావ్యము వేదాదులవలె శాసింపదు. ఇతిహాసాదులవలె మందలింపదు. కాని విష్ణుధర్మోత్తర మనినట్లు—

తదేవకావ్య మిత్యుక్త ముపదేశై ర్వినాకృతమ్ (3 15)

ఉపదేశము చేయకుండ ఉండువిధముగ భాసించునదే కావ్యము.

అగ్నిపురాణములోని రసోత్పత్తి విధానమును భోజుడు విస్తృత పరచెను ఆ తర్వాత శారదాతనయుడు ఈ వాదమును వివరించెను.

| | |
|---|---|
| శాస్త్రే శబ్ద ప్రధానత్వ మితిహా సేఽర్థనిష్ఠతా | 337 2 |
| అభిధాయాః ప్రధానత్వా త్కావ్యం తాభ్యాం విభిద్యతే | 3 |
| ఇష్టార్థవ్యవచ్ఛిన్నా పదావళీ | 6 |
| కావ్యం స్ఫుటదలంకారం గుణవ ద్దోషవర్జితమ్ | 7 |
| సర్వవృత్తి ప్రవృత్తం చ సర్వభావప్రభావితమ్ | 31 |
| సర్వరీతిరసైః పుష్టం పుష్టం గుణవిభూషణైః | |
| అత ఏవ మహాకావ్యం తత్కర్తా చ మహాకవిః | 32 |
| వాగ్వైదగ్ధ్యప్రధానేఽపి రస ఏ వాత్ర జీవితమ్ | |
| పృథక్ ప్రయత్న నిర్వర్త్యం వాగ్వక్రిమ్ణి రసా ద్వపుః. | 33 |

శరీరం నాటకాదీనా మితివృత్తం ప్రచక్షతే 338.17

అక్షరం పరమం బ్రహ్మ సనాతన మజం విభుమ్
వేదాంతేషు వదం త్యేకం చైతన్యం జ్యోతి రీశ్వరమ్ 339 1

ఆనంద స్సహజ స్తస్య వ్యజ్యతే న కదాచ న
వ్యక్తిః సా తస్య చైతన్య చమత్కారరసాహ్వయా 2

ఆద్య స్తస్య వికారో యః సోఽ హంకార ఇతి స్మృతః
తతోఽ భిమాన స్తత్రేదం సమాప్తం భువనత్రయమ్ 3

అభిమానా ద్రతిః సా చ పరిపోష ముపేయుషీ
వ్యభిచార్యాది సంయోగా చ్ఛృంగార ఇతి గీయతే 4

తద్భేదాః కామ మితరే హాస్యాద్యా అ ప్యనేకశః
స్వస్వస్థాయివిశేషోత్థ పరిపోషస్వలక్షణాః 5

లక్ష్మీ రివ వినా త్యాగా న్న వాణీ భాతినీరసా 9
అపారే కావ్యసంసారే కవి రేవ ప్రజాపతిః,

యథా వై రోచతే విశ్వం త థేదం పరివర్తతే. 10

శృంగారిచే త్కవిః కావ్యే జాతం రసమయం జగత్
స చేత్కవి ర్వీతరాగో నీరసో వ్యక్త మేవ తత్ 339 11

న భావహీనోఽ స్తి రసో న భావో రసవర్జితః
భావయంతి రసా నేభిః భావ్యంతే చ రసా ఇతి. 12

కావ్యశోభాకరాన్ ధర్మా నలంకారాన్ ప్రచక్షతే. 342 17

అలంకరణ మర్థానా మర్థాలంకార ఇష్యతే
తం వినా శబ్దసౌందర్య మపి నాస్తి మనోహరమ్. 344.1

అర్థాలంకార రహితా విధ వేవ సరస్వతీ. 2

---

# భరత ముని : నాట్యశాస్త్రమ్

నాట్యశాస్త్రము లభించుచున్న లక్షణగ్రంథములలో అతిప్రాచీన మైనది ఇప్పుడు దొరకుచున్న పాఠముతో నున్నగ్రంథము క్రీ శ మూడవ శతాబ్దారంభమునాటి దనవచ్చును 36 అధ్యాయములలోనున్న నాట్యశాస్త్రము రూపకవిషయమున నందికేశ్వరుని గ్రంథము రసవిషయమున ప్రామాణిక గ్రంథము లని రాజశేఖరు డనినాడు భరతునకన్న పూర్వమే రస సిద్ధాంతము కలదు కనుకనే తన భావమును దృఢపరచు ప్రాచీన శ్లోకము లను భరతు డుదాహరింప గలిగెను

రససిద్ధాంతమును సూత్రప్రాయముగా వివరించునది నాట్య శాస్త్రము రసము లేనిదే కావ్య ముండదు కనుక రసనిష్పత్తిని చెప్పవలసి వచ్చినది విభావములు, అనుభావములు సంచారిభావములు అనువాని సంయోగవశమున నిష్పన్న మగునది రసము ఈ వాక్యమునకు భిన్న వ్యాఖ్యలు చేసినవారిలో లోల్లట శంకుక భట్టనాయక, అభినవగుప్తాదు లున్నారు

భరతుని నాట్యశాస్త్రము సాహిత్య సమీక్షకులకు ముఖ్యగ్రంథము ఇందలి వాదములనే తర్వాతివారు వివరింపసాగిరి ఆ వివరణములలో ఒక్కొకప్పుడు నూతనవాదములు బయలుదేరినవి కావ్య నాట్య నృత్య సంగీతములకు చెందినవిషయము లన్నియు చెప్పబడిన నాట్యశాస్త్రము నేడు అభినవుని వివృతితో లభించుచున్నది

దేవతలు దృశ్యము శ్రవ్యము అను క్రీడనీయకమును కోరిరి చిత్తవి క్షేపమును కలుగజేయునది చిత్తమును వికసింపజేయునది చిత్తమునకు ఉత్తేజనము కల్గింపగల్గినది క్రీడనీయకము చిత్తములో దాగియున్న భయ శోకాదులు నాట్యముద్వారా బహిర్గతములై చిత్తశాంతిని చేకూర్ప గలవు ఇట్టి నాట్యము కంటికి చెవికి కూడ ఉద్దేశింపబడినది ఇంతే గాక సుఖదుఃఖాత్మక మైన లోకమునవే నాట్య ముండ వీ లున్నది సర్వకర్మాను దర్శక మగు నాట్యమున సకలశాస్త్రములలోని అర్థము కలదు ఇది సర్వ

శిల్పములకు ప్రవృత్తిహేతువు. కర్మవిపాకమును, భావపరిణామములను చెప్పునది ముల్లోకములలోని సకలభావములను స్వసంవేదనకు యోగ్యములుగా చేయుచున్నది కొన్ని నాట్యములలో ధర్మము కొన్నింట క్రీడ, మరికొన్నిటిలో అర్థము వేరొకచో శమము మరొక్కచో హాస్యము, ఇతరత్ర యుద్ధము ఇంకొకచో కామము, అన్యత్ర వధ ప్రధానములు. ధర్మప్రవృత్తి గలవారికి ధర్మము, కాముకులకు కామము దుష్టులకు నిగ్రహము, వినీతులకు దమము నాట్యమున కనిపించును దుఃఖితులకు ఉత్సాహము చిత్తక్షోభ గలవారికి ధైర్యము నాట్య మీయగలదు కనుక నాట్యము లోకవృత్తమును అనుకరించునది మానవులకు అందరకు వారు వారు చేయవలసిన పనులను, విధులను తెలుపునది హితము నుపదేశించునది ధైర్యమును, విస్మయోత్సాహములను సుఖమును కలుగచేయునది నాట్యము దుఃఖ శోక శ్రమాదులవలన క్షోభ చెందినవారికి తపస్సు చేసికొనువారికి నాట్యము విశ్రాంతి నొసగునది ధర్మమునకు విరుద్ధము కానిది లోకములో ప్రసిద్ధి చెందుటకు కారణమైన దానిని చూపునది ఆయుర్వృద్ధికరము, హితకరము బుద్ధిని వృద్ధిచేయునది నాట్యము సప్తద్వీపములలోను ముల్లోకములలోను కల భావములకు అనుకరణరూపమగు నాట్యమున ఏది హృదయగోచరము కాదో అట్టి జ్ఞానము శిల్పము విద్య కళలు యోగము కర్మలు లేనే లేవు సుఖదుఃఖములతో కలిసియున్న ఈలోక స్వభావము ఆంగికాద్యభినయముల ద్వారా ప్రదర్శింపబడుటయే నాట్యము

శృంగారాదిరసములు గ్లాని మొదలగు భావములు, నాల్గువిధముల అభినయములు రెండుతెరగుల నున్న ధర్మి వృత్తులు ప్రవృత్తులు సిద్ధి, స్వరములు వాద్యసంగీతము గాత్రసంగీతము రంగము అను పదునొకండు అంగములతో ఉన్నది. నాట్యము కావ్యనాట్యములలో ప్రధానమైనవి రసములు ఇవి ఎనిమిది అని భరతుని మతము వీనికి సంబంధించిన రతి మొదలగు ఎనిమిది చిత్తవృత్తులను స్థాయిభావము లందురు సంచారిభావములు ముప్పదిమూడు సాత్త్వికభావములు ఎనిమిది.

రసము లేనిచో ఏవిషయము కాని భావము కాని ప్రవర్తింపజాలదు విభావములు అనుభావములు వ్యభిచారిభావములు అను వానికి స్థాయిభావ

ముతో సంయోగము కలుగగా రసము నిష్పన్న మగుచున్నది. బెల్లము మొదలగు పదార్థములతోను, వ్యంజనద్రవ్యములతోను రుచులుబయలుదేరునట్లు నానాభావోపగతము లగు స్థాయిభావములు రసములుగా పరిణమించుచున్నవి ఆస్వాద్యత్వము రసలక్షణము వివిధభావాభినయ వ్యంజితములు, వాగంగసత్త్వోపేతములు అగు స్థాయిభావములను సహృదయులగుప్రేక్షకులు ఆస్వాదింతురు భావములనుండి రసములు బయలుదేరుచున్నవని భరతుడు భావము లేనిరసము, రసము లేని భావము లేదు వీనికి అన్యోన్యాశ్రయ మున్నది రసములను భావములు నిష్పన్నము చేయుచున్నవి. భావములను రసములు భావింపబడునట్లు చేయుచున్నవి. ఐనను బీజమువంటిది రసము ఈరసములనుండి భావములు వచ్చుచున్నవి

కావ్యార్థము లైన రసములను నిష్పన్నము చేయునవి భావములు. అప్పుడు కావ్యమున గాని నాట్యమున గాని గల రస భావాదులు కేవలము లోకవృత్తానుకరణము అని గ్రహింపరాదు అందుచే లోకధర్మి అని నాట్యధర్మి అని ధర్మిద్వయము గల దని భరతు డనినాడు లోకప్రసిద్ధమైన వృత్తాంతమును ఉన్న దున్నట్లుగా నాట్యమున కావ్యమున చూపుటలో లోకధర్మి కలదు నర్తనాది నాట్యప్రక్రియ లిచట కన్పింపవు

కల్పితము లైన వాక్యాదుల ద్వారా ఉత్పన్న మగు ప్రవృత్తి. కవి కల్పించిన చిత్తవృత్తిని అంగహారాదిరూపమున ప్రదర్శించుట, స్వరాలంకారములతో కూడిన ప్రయోగము మొద లగునవి నాట్యధర్మిని తెలుపునవి వాస్తవజీవితమును యథాతథముగా చూపక కావ్యజగత్తున కావ్యస్వరూపమునకు అనుగుణముగా జీవితమును చిత్రించుటలో నాట్యధర్మి కలదు రంగస్థలమున ఇద్దరుపాత్రలు ఒకరితో నొకరు మాట్లాడుకొనుచున్నను మూడవవ్యక్తికి అది వినబడకపోవుట లోకవిరుద్ధ మైనను నాట్యసమ్మతమే

క్రీడనీయక మిచ్ఛామో దృశ్యం శ్రవ్యం చ య ద్భవేత్
సర్వశాస్త్రార్థసంపన్నం సర్వశిల్పప్రవర్తకమ్ 1 15

కర్మభావాన్వయాపేక్షీ నాట్యవేదో మయా కృతః 1 106

త్రైలోక్య స్యాస్య సర్వస్య నాట్యం భావానుకీర్తనమ్ 1 107

క్వచి ద్ధర్మః క్వచిత్ క్రీడా క్వచి దర్థః క్వచి చ్ఛమః
క్వచి ద్ధాస్యం క్వచి ద్యుద్ధం క్వచి త్కామః క్వచి ద్వధః 1 1 8

ధర్మో ధర్మ ప్రవృత్తానాం కామః కామోపసేవినామ్
నిగ్రహో దుర్వినీతానాం వినీతానాం దమక్రియా 1 109

అబుధానాం విబోధ శ్చ వైదుష్యం విదుషా మపి 1.110

.... .. .. ... స్థైర్యం దుఃఖార్దితస్య చ
అర్థోపజీవినా మర్థో ధృతి రుద్విగ్నచేతసామ్ 1 1 1

నానాభావోపసంపన్నం నానావస్థాంతరాత్మకమ్
లోకవృత్తానుకరణం నాట్య మేత న్మయా కృతమ్ 1 112

ఉత్తమాధమ మధ్యానాం నరాణాం కర్మసంశ్రయమ్
హితోపదేశజననం ధృతిక్రీడాసుఖాదికృత్. 1 1 8

దుఃఖార్తానాం శ్రమార్తానాం శోకార్తానాం తపస్వినామ్
విశ్రాంతిజననం కాలే నాట్య మేత ద్భవిష్యతి 1 114

ధర్మ్యం యశస్య మాయుష్యం హితం బుద్ధివివర్ధనమ్
లోకోపదేశజననం నాట్య మేత ద్భవిష్యతి 1 115

న తజ్ జ్ఞానం న త చ్ఛిల్పం న సా విద్యా న సా కలా
నాఽసౌ యోగో న తత్కర్మ నాట్యేఽస్మిన్ యన్న దృశ్యతే 1 116

సప్తద్వీపానుకరణం నాట్య మేత ద్భవిష్యతి. 1 117

యోఽయం స్వభావో లోకస్య సుఖదుఃఖసమన్వితః
సోఽంగాద్యభినయోపేతో నాట్య మి త్యభిధీయతే. 1.119

రసా భావా హ్యభినయాః ధర్మీ వృత్తిప్రవృత్తయః
సిద్ధిః స్వరా స్తథాతోద్యం గానం రంగ శ్చ సంగ్రహః 6 10

శృంగార హాస్య కరుణా రౌద్ర వీర భయానకాః
బీభత్సాద్భుత సంజ్ఞౌ చే త్యష్టౌ నాట్యే రసాః స్మృతాః 6.15

రతి ర్హాస శ్చ శోక శ్చ క్రోధోత్సాహౌ భయం తథా
జుగుప్సా విస్మయ శ్చేతి స్థాయిభావాః ప్రకీర్తితాః. 6 17

న హి రసా దృతే కశ్చి దర్థః ప్రవర్తతే పుట 1 272

తత్ర విభా వానుభావ వ్యభిచారి సంయోగా ద్రస
నిష్పత్తిః పుట 1.272

కో దృష్టాంతః? అత్రాహ - యథా హి నానావ్యంజనౌషధి ద్రవ్యసంయోగా ద్రసనిష్పత్తిః, తథా నానాభావోపగమా ద్రస నిష్పత్తిః యథా హి- గుడాదిభిః ద్రవ్యైః వ్యంజనై రౌషధిభి శ్చ షాడబాదయో రసా నిర్వర్త్యంతే, తథా నానాభావోపగతా అపి స్థాయినో భావా రసత్వ మాప్నువం తీతి

పుట 1 287-8

అత్రాహుః -రస ఇతి కః పదార్థః? ఉచ్యతే-
ఆస్వాద్యత్వాత్. పుట 1 288

భావేభ్యో రసానా మభి నిర్వృత్తి ర్న తు రసేభ్యో
భావానా మభినిర్వృత్తి రితి పుట 1 292

స్థాయిభావాం శ్చ రసత్వ ముపనేష్యామః. పుట 1 293

ఏవం భావా భావయంతి రసా నభినయైః సహ. 6 35

న భావహీనోఽస్తి రసో న భావో రసవర్జితః
పరస్పరకృతా సిద్ధి స్తయో రభినయే భవేత్ 6 36

వ్యంజనౌషధిసంయోగో యథాన్నం స్వాదుతాం నయేత్
ఏవం భావా రసా శ్చైవ భావయంతి పరస్పరమ్ 6 37

యథా బీజా ద్భవే ద్వృక్షో వృక్షా త్పుష్పం ఫలం యథా
తథా మూలం రసాః సర్వే తేభ్యో భావా వ్యవస్థితాః 6 38

వాగంగసత్త్వోపేతాన్ కావ్యార్థాన్ భావయంతీతి పుట 1 842
భావాః

యోఽర్థో హృదయసంవాదీ తస్య భావో రసోద్భవః
శరీరం వ్యాప్యతే తేన శుష్కం కాష్ఠ మివాగ్నినా. 7 7

లౌకికీ నాట్యధర్మీ చ తయో ర్వక్ష్యామి లక్షణమ్ 18 70

స్వభావ భావోపగతం శుద్ధం తు వికృతం తథా
లోకవార్తాక్రియోపేత మంగలీలావివర్జితమ్ 18 71

స్వభావాభినయోపేతం నానాస్త్రీపురుషాశ్రయమ్
య దీదృశం భవే న్నాట్యం లోకధర్మీ తు సా స్మృతా 18 72

అతివాక్యక్రియోపేత మతిసత్త్వాతి భావకమ్
లీలాంగహారాభినయం నాట్యలక్షణలక్షితమ్ 18 73

స్వరాలంకారసంయుక్త మస్వస్థపురుషాశ్రయమ్
య దీదృశం భవే న్నాట్యం నాట్యధర్మీ తు సా స్మృతా. 18 74

లోకే య దభియోజ్యం చ పద మ త్రోపయుజ్యతే
మూర్తిమ త్సాభిలాషం చ నాట్యధర్మీ తు సా స్మృతా 18 75

ఆసన్నోక్తం చ య ద్వాక్యం న శృణ్వంతి పరస్పరమ్
అనుక్తం శ్రూయతే యచ్చ నాట్యధర్మీ తు సా స్మృతా 18 76

శైలయానవిమానాని చర్మవర్మాయుధ ధ్వజాః
మూర్తిమంతః ప్రయుజ్యంతే నాట్యధర్మీ తు సా స్మృతా 18 77

లలితై రంగ విన్యాసైః తథోత్క్షిప్తపదక్రమైః
నృత్యతే గమ్యతే చాపి నాట్యధర్మీ తు సా స్మృతా. 18 80

యోఽయం స్వభావో లోకస్య సుఖదుఃఖక్రియాత్మకః
సోఽంగాభినయసంయుక్తో నాట్యధర్మీ తు సా స్మృతా. 18 81

నాట్యధర్మి ప్రవృత్తం హి సదా నాట్యం ప్రయోజయేత్
న హ్యంగాభినయా త్కించి దృతే రాగః ప్రవర్తతే 13 84

సర్వస్య సహజో భావః సర్వో హ్యభినయోఽర్థతః
అంగాలంకారచేష్టా తు నాట్యధర్మి ప్రకీర్తితా. 13 85

సర్వేషా మేవ కావ్యానాం మాతృకావృత్తయః స్మృతాః
ఆభ్యో వినిస్సృతం హ్యేత ద్దశరూపం ప్రయోగతః. 18 4



# భామహాచార్యుడు

భామహుడు ప్రాచీనాలంకార శాస్త్రములను సమగ్రముగా పరిశీలించి అలంకార శాస్త్రమును చెప్పితి ననినాడు(1 13-15, 2 95 5.69) ఆరవ శతాబ్దమునకు చెందిన దండి తర్వాత వచ్చిన భామహుడు 600-680 ప్రాంతమువాడు

ఆరు పరిచ్ఛేదములలో నున్న భామహాలంకారమున 396 శ్లోకములున్నవి కావ్యప్రయోజనము కవిలక్షణము కావ్యలక్షణము కావ్యభేదములు మొదట చెప్పబడినవి రెండవ పరిచ్ఛేదమున మాధుర్యము, ప్రసాదము ఓజస్సు అను గుణములను ప్రస్తావించి అలంకారములను తీసికొనినాడు మూడవ పరిచ్ఛేదమున అలంకారములను పూర్తిచేసి, నాలుగో పది దోషములను, ఐదున పదకొండవ దోషమును వివరించి చివర పరిచ్ఛేదమున సౌశబ్ద్య ప్రాప్తికి మార్గము చూపినాడు

కావ్యము కీర్తిని ప్రీతిని ఇచ్చునది. శాస్త్రమును మూర్ఖుడైనను అభ్యసింప వీలున్నది కాని కావ్యము మాత్రము ప్రతిభావంతుని వద్ద నుండి మాత్రమే ఆవిర్భవించునది.

కావ్యశరీరమున ముఖ్యమైనవి శబ్దము అర్థము - శబ్దశాస్త్రము, ఛందశ్శాస్త్రము, ఇతిహాసము లోకజ్ఞానము మొదలగునవి కావ్యమునకు ఉపకరించు సాధనములు. పూర్వకవుల రచనలుకూడ కవికి చాల అవసరము కుకవిత్వము మృతియే గనుక ముఖ్యముగా కవికి కావలసినది సౌశబ్ద్యము.

స్త్రీముఖము అందముగా నున్నను అలంకారము లేనిచో చక్కగా ప్రకాశింపదు అట్లే రూపకాద్యలంకారములతో అలంకరింపబడని కావ్యము కూడ అలంకృతమైన చక్కని శబ్దములు అర్థాలంకారములుకూడ కావ్యమున ముఖ్యము

శబ్దార్థసహితమైనది సాహిత్యము శబ్దము అర్థము అనునవి కలసియుండునది సాహిత్యము. ఇది గద్యరూపమున గాని పద్యరూపమున గాని ఉండవచ్చును ఈ సాహిత్యము సంస్కృతములో గాని ప్రాకృత

ములో గాని అపభ్రంశభాషలో గాని ఉండవీలున్నది దేవాసుల చరితము ఉత్పాద్యవస్తువు కళాశ్రయము శాస్త్రాశ్రయము అను వానిలో నే దైననుసాహిత్యమున ఉండవీలున్నది

సర్గబంధము అభినేయార్థము ఆఖ్యాయిక కథ అనిబద్ధము అని మరల ఐదు విధములలో కావ్యములను విభజింపవచ్చును లోకస్వభావమును గ్రహించుచు రసములతో సమన్వితము లైన సర్గబంధములు చక్కని ఉపదేశముల నొసగజాలినవి అగ్రామ్యశబ్దములు అర్థవంతములగు పదములు అలంకారములు గల సర్గబంధము మహాకావ్యము అభినేయార్థము రూపకము గద్యముతో కలిసియున్న ఉదాత్తవిషయము ఆఖ్యాయిలో కలదు ఒకదానితో నొకదానికి సంబంధము లేని గాథలు కాని శ్లోకములు కాని కలది అనిబద్ధకావ్యము ఈ కావ్యములలో వాక్కునకు అలంకార మొసగు వక్రోక్తి ఉండుట అవసరము అందుచే వక్రోక్తి లేని హేత్వాదులను అలంకారములు కావనినాడు. అతిశయోక్తిని అలంకార పర్యాయముగా పల్కినాడు కావ్యము అలంకార ప్రధాన మని యెంచుటచే రసవదలంకారమును ప్రస్తుతింప గల్గిన భామహుడు శృంగారాది రస వివేచన చేయలేదు కాని భావికాలంకార మను పేరున భావనావ్యాపారమును గుర్తించినాడు

ఆస్వాదయోగ్య మైన కావ్యరసములో అంతర్లీనముగా శాస్త్రము ఉపదిష్ట మైనను అట్టి కావ్యము ఆమోదకరమే యగును కావ్యములో గల శబ్దము అర్థము కళ న్యాయము అనునవి ఆ కావ్యమునకు అంగములుగా పరిణమింపనిచో అవి గొప్ప బరువులే యగును

భామహుని మతమున వక్రోక్తి శబ్దమునకు అలంకార మని అర్థముంచుటచే ఈ వక్రోక్తి లేనిదే సాహిత్యమే ఉండజాలదు కావ్యమునకు కావ్యత్వమును ఆపాదించునది వక్రోక్తి గుణసామ్య ప్రతీతిని (2 79) చెప్పుటయే గాక సమాసోక్తిలో క్రొత్త అర్థము గమ్యమాన మని పల్కుటచేతను, పర్యాయోక్తిలో ప్రకారాంతరముగా అభిధేయమాన మగు అర్థమున్న దనుటచేతను వ్యంజనను అలంకారముల గుణముగా భామహుడు అంగీకరించిన ట్లున్నది

భామహస్య కావ్యాలంకారః

ధర్మార్థకామ మోక్షేషు వైచక్షణ్యం కలాసు చ
ప్రీతిం కరోతి కీర్తిం చ సాధుకావ్య నిషేవణమ్. 1 2

కావ్యం తు జాయతే జాతు కస్యచిత్ ప్రతిభావతః 1 5

ఉపేయుషా మపి దివం సన్నిబంధ విధాయినామ్
ఆస్త ఏవ నిరాతంకం కాంతం కావ్యమయం వపుః 1 6

శబ్దాభిధేయే విజ్ఞాయ కృత్వా తద్విదుపాసనామ్
విలోక్యాన్య నిబంధాంశ్చ కార్యః కావ్యక్రియాదరః 1 10

సర్వథా పద మప్యేకం న నిగాద్య మవద్యవత్
విలక్ష్మణా హి కావ్యేన దుస్సుతేనేవ నింద్యతే 1 11

నాకవిత్వ మధర్మాయ వ్యాధయే దండనాయ వా
కుకవిత్వం పునః సాక్షా న్మృతి మాహు ర్మనీషిణః 1. 2

రూపకాది రలంకార స్తస్యాన్యై ర్బహుధోదితః
న కాంత మపి నిర్భూషం విభాతి వనితాముఖమ్ 1.13

త ఏత దాహుః సౌశబ్ద్యం నార్థవ్యుత్పత్తి రీదృశీ
శబ్దాభిధేయాలంకారభేదా దిష్టం ద్వయం తు నః 1 15

శబ్దార్థౌ సహితౌ కావ్యం గద్యం పద్యం చ తద్ద్విధా 1 16

చతుర్వర్గాభిధానేఽపి భూయసార్థోపదేశకృత్
యుక్తం లోకస్వభావేన రసైశ్చ సకలైః పృథక్ 1 21

వక్రాభిధేయశబ్దోక్తి రిష్టా వాచా మలంకృతిః. 1 36

యుక్తం వక్రస్వభావోక్త్యా సర్వ మేవైత దిష్యతే
స్వాదుకావ్యరసోన్మిశ్రం శాస్త్ర మప్యుపయుంజతే
ప్రథమాలీఢమధవః పిబంతి కటుభేషజమ్ 5 3

న స శబ్దో న తద్వాచ్యం న స న్యాయో న సా కలా
జాయతే యన్న కావ్యాంగ మహో భారో మహాన్ కవేః 5 4

వాచాం వక్రార్థశబ్దోక్తి రలంకారాయ కల్పతే 5 66

యుక్తం వక్రస్వభావోక్త్యా సర్వ మేవైత దిష్యతే 1.30

సైషా సర్వైవ వక్రోక్తి రనయార్థో విభావ్యతే
యత్నోఽస్యాం కవినా కార్యః కోఽలంకారోఽనయా వినా?
2 85

హేతు శ్చ సూక్ష్మో లేశోఽథ నాలంకారతయా మతః
సముదాయాభిధానస్య వక్రోక్త్యనభిధానతః 2 86

సమానవస్తున్యాసేన ప్రతివస్తూప మోచ్యతే
యథే వానభిధానేఽపి గుణసామ్య ప్రతీతితః 2 34

యత్రోక్తే గమ్యతేఽన్యోఽర్థ స్తత్సమానవిశేషణః
సా సమాసోక్తి రుద్దిష్టా సంక్షిప్తార్థతయా యథా. 2 79

పర్యాయోక్తం య దన్యేన ప్రకారే ణాభిధీయతే 3 8

భావికత్వ మితి ప్రాహుః ప్రబంధ విషయం గుణమ్
ప్రత్యక్షా ఇవ దృశ్యంతే యత్రార్థా భూతభావినః 3 53

శబ్ద శ్ఛన్దోఽభిధానార్థా ఇతిహాసాశ్రయాః కథాః
లోకో యుక్తిః కలా శ్చేతి మన్తవ్యాః కావ్యవేదిభిః. 1 9

శ్రవ్యం నాతిసమస్తార్థం కావ్యం మధుర మిష్యతే
ఆవిద్వదంగనాబాల ప్రతీతార్థం ప్రసాదవత్. 2 3

# ఆచార్య దండి

కిరాతార్జునీయ మహాకావ్య ప్రణేత యగు భారవికి ముమ్మనుమడు అతడు సింహవిష్ణుప్రభుని యాస్థానమున నుండుటచే నృసింహవర్మ ప్రభు కాలమున గూడ జీవించి యుండుట అసంభావ్యము కా దని తోచును దండి తండ్రి వీరదత్తుడు తల్లి గౌరీదేవి మిత్రులు రామశర్మ, మాతృదత్త, భజనానందులు. చాళుక్య విక్రమాదిత్యుడు కాంచీపురమును పండ్రెండు సంవత్సరములపాటు ముట్టడించినపుడు దండి కేరళాది దేశములలో సంచారము చేసి కాంచీపురము స్వాతంత్ర్యము నొందిన పిదప అచటికి మరలి వచ్చెను కావున దండి 630 - 40 వత్సరములలో నుండె ననుట నిర్వివాదము. ఉత్తరదేశమున ఆనందపుర నివాసు లగు దండి పూర్వపురుషులు క్రమముగా దక్షిణాపథమునకు వచ్చినారు

దండి దశకుమార చరితము (అవంతిసుందరీ కథ) కావ్యాదర్శము, ద్విసంధాన కావ్యము అనామయ స్తోత్రము రచించినాడు వైయాకరణులకు ఈయనయెడ గౌరవము దండి మహాభాష్యమునకు వ్యాఖ్య రచించి యుండు నని కొందరి యూహ ఈ విద్వద్వరేణ్యుడు పూర్వాచార్య గ్రంథములను సంగ్రహించినా నని చెప్పినాడు వారు కాశ్యప బ్రహ్మనంది, బ్రహ్మదత్త ప్రభృతు లని వ్యాఖ్యాత లన్నారు

కావ్యాదర్శమున మూడు పరిచ్ఛేదములు కలవు కావ్యలక్షణ, కావ్యభేద, పద్య గద్య మిశ్రకావ్య వైదర్భ గౌడీయ మార్గములు, గుణములు, మార్గద్వయవివరణము ప్రథమ పరిచ్ఛేదమున నున్నవి ద్వితీయమున అర్థాలంకారములు శబ్దాలంకారములు ప్రహేళికాదులు నిరూపింపబడినవి. దేశకాలాదివిరోధములు ఒక్కొక్కప్పుడు విరోధములే గుణము లగుటయు చెప్పబడినవి ఇవి గమనార్హములు

ప్రథమ పరిచ్ఛేదములో ముఖ్యముగా వివరింపబడినవి గుణములు భామహాదులు గుణములు మూ డన్నారు దండి పది అన్నాడు భోజాదులు ఇరువదినాలు గన్నారు గుణములు కొన్నిటిని శబ్దగతము లనియు కొన్నిటిని అర్థగతము లనియు దండి పలికినాడు మాధుర్యము,

ఔదార్యము, కాంతి ప్రసాదము అర్థవ్యక్తి అర్థగతములు శ్లేష సమతా, సౌకుమార్య ఓజ స్సమాధి, మాధుర్యార్థ వ్యక్తులు శబ్దగత ములు

దండిమతమున అర్థాలంకారములు 35 పరిశీలన చేసిన కొలది భేద ములు పొడకట్టుచుండును సంపూర్ణముగా వాని నెవడు తెలుపగల డన్నాడు

యమకాది శబ్దచిత్రములను చూపి శబ్దాలంకారము లెన్నో కల వన్నాడు

ప్రహేళికలు 16 ఇందు 14 స్పష్టముగా బోధపడనందున దండి వానిని దుష్టము లన్నాడు ప్రహేళికలు కాలక్షేపార్థము పనికి వచ్చును; సభారంజనమునకు గూడ నుపయుక్తము లగును. కొందరు వీనిని పెంచి వారు వీనిలో కావ్యత్వ మున్నను లేకున్నను రసికజనులకు కొంత మోదము సమకూరును భోజాదులు వీనిని వివరించినారు అన్నిభాషల లోను ప్రహేళికలు కలవు

దండ్యాచార్యుడు ప్రధానముగా గుణవాది ఆంధ్రభాషా కవులమీద ఈయన ప్రభావము మెండు

కావ్యాదర్శమున కెన్నో వ్యాఖ్య లున్నవి

ఆచార్య దండిన,
కావ్యాదర్శః

ప్రథమః పరిచ్ఛేదః

చతుర్ముఖ ముఖాంభోజవన హంసవధూ ర్మమ
మానసే రమతాం నిత్యం సర్వశుక్లా సరస్వతీ

పూర్వశాస్త్రాణి సంహృత్య ప్రయోగా నుపలక్ష్య చ
యథా సామర్థ్య మస్మాభిః క్రియతే కావ్యలక్షణమ్

ఇహ శిష్టాను శిష్టానాం శిష్టానా మపి సర్వథా
వాచా మేవ ప్రసాదేన లోకయాత్రా ప్రవర్తతే

ఇద మంధతమః కృత్స్నం జాయేత భువనత్రయమ్
యది శబ్దాహ్వయం జ్యోతి రాసంసారం న దీప్యతే

ఆది రాజయశోబింబ మాదర్శం ప్రాప్య వాఙ్మయమ్
తేషా మసన్నిధానేఽపి న స్వయం పశ్య నశ్యతి

గౌ ర్గౌః కామదుఘా సమ్యక్ ప్రయుక్తా స్మర్యతే బుధైః
దుష్ప్రయుక్తా పున ర్గోత్వం ప్రయోక్తుః సైవ శంసతి

త దల్ప మపి నోపేక్ష్యం కావ్యే దుష్టం కథం చ న
స్యా ద్వపుః సుందర మపి శ్విత్రే ణైకేన దుర్భగమ్

గుణదోషా నశాస్త్రజ్ఞః కథం విభజతే జనః
కి మంధ స్యాధికారోఽస్తి రూపభేదోపలబ్ధిషు

అతః ప్రజానాం వ్యుత్పత్తి మభిసంధాయ సూరయః
వాచాం విచిత్రమార్గాణాం నిబబంధుః క్రియావిధిమ్.

తైః శరీరం చ కావ్యానాం అలంకారా శ్చ దర్శితాః
శరీరం తావ దిష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావలీ

పద్యం గద్యం చ మిశ్రం చ త త్త్రి ధైవ వ్యవస్థితమ్
పద్యం చతుష్పదీ త చ్చ వృత్తం జాతి రితి ద్విధా.

ఛందోవిచిత్యాం సకలః తత్ప్రపంచో నిదర్శితః
సా విద్యా నౌ స్తితీర్షూణాం గంభీరం కావ్యసాగరమ్

ముక్తకం కులకం కోశః సంఘాత ఇతి తాదృశః
సర్గబంధాంగరూపత్వా దనుక్తః పద్యవిస్తరః

సర్గబంధో మహాకావ్య ముచ్యతే తస్య లక్షణమ్
ఆశీ ర్నమస్క్రియా వస్తు నిర్దేశో వాపి తన్ముఖమ్

ఇతిహాస కథోద్భూత మితర ద్వా సదాశ్రయమ్
చతుర్వర్గఫలోపేతం చతురోదాత్తనాయకమ్

నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయ వర్ణనైః
ఉద్యాన సలిల క్రీడా మధుపాన రతోత్సవైః

విప్రలంభై ర్వివాహైశ్చ కుమారోదయ వర్ణనైః
మంత్ర దూత ప్రయాణాజి నాయకాభ్యుదయై రపి

అలంకృత మసంక్షిప్తం రసభావ నిరంతరమ్
సర్గై రనతి విస్తీర్ణైః శ్రవ్య వృత్తైః సుసంధిభిః

సర్వత్ర భిన్నవృత్తాంతై రుపేతం లోక రంజకమ్
కావ్యం కల్పాంతరస్థాయి జాయేత సదలంకృతి

న్యూన మప్యత్ర యైః కైశ్చి దంగైః కావ్యం న దుష్యతి
య ద్యుపాత్తేషు సంపత్తి రారాధయతి తద్విదః

గుణతః ప్రా గుపన్యస్య నాయకం, తేన విద్విషామ్
నిరాకరణ మి త్యేష మార్గః ప్రకృతిసుందరః

వంశవీర్యశ్రుతాదీని వర్ణయిత్వా రిపో రపి
త జ్జయా న్నాయకోత్కర్ష వర్ణనం చ ధినోతి నః

అపాదః పదసంతానో గద్య మాఖ్యాయికా కథా
ఇతి తస్య ప్రభేదౌ ద్వౌ తయో రాఖ్యాయికా కిల

నాయకే నైవ వాచ్యాన్యా నాయకే నేతరేణ వా
స్వగుణావిష్క్రియా దోషో నాత్ర భూతార్థ శంసినః

అపి త్వనియమో దృష్ట స్తత్రా ప్యన్యై రుదీరణాత్
అన్యో వక్తా స్వయం వేతి కీదృగ్వా భేదలక్షణమ్

వక్త్రం చాపరవక్త్రం చ సోచ్ఛ్వాసత్వం చ భేదకమ్
చిహ్న మాఖ్యాయికాయా శ్చేత్ ప్రసంగేన కథాస్వపి

ఆర్యాదివ త్ప్రవేశః కిం న వక్త్రాపరవక్త్రయోః
భేదశ్చ దృష్టో లంభాది రుచ్ఛ్వాసో వాస్తు కిం తతః

త త్కథాఖ్యాయికే త్యేకా జాతిః సంజ్ఞా ద్వయాంకితా
అత్రై వాంత ర్భవిష్యంతి శేషా శ్చాఖ్యానజాతయః

కన్యాహరణ సంగ్రామ విప్రలంభోదయాదయః
సర్గబంధసమా ఏవ నైతే వైశేషికా గుణాః

కవి భావ కృతం చిహ్న మన్య త్రాపి న దుష్యతి
ముఖ మిష్టార్థ సంసిద్ధౌ కిం హి న స్యాత్ కృతాత్మనామ్

మిశ్రాణి నాటకాదీని తేషా మన్యత్ర విస్తరః
గద్యపద్యమయీ కాచి చ్చంపూ రి త్యభిధీయతే

త దేత ద్వాఙ్మయం భూయః సంస్కృతం ప్రాకృతం తథా
అపభ్రంశ శ్చ మిశ్రం చే త్యాహు రార్యా శ్చతుర్విధమ్

సంస్కృతం నామ దైవీవాక్ అన్వాఖ్యాతా మహర్షిభిః
తద్భవః తత్సమో దేశీ త్యనేకః ప్రాకృతక్రమ

మహారాష్ట్రాశ్రయాం భాషాం ప్రకృష్టం ప్రాకృతం విదుః
సాగరః సూక్తిరత్నానాం సేతుబంధాది యన్మయమ్

శౌరసేనీ చ గౌడీ చ లాటీ చాన్యా చ తాదృశీ
యాతి ప్రాకృత మి త్యేవం వ్యవహారేషు సన్నిధిమ్

ఆభీరాది గిరః కావ్యే ష్వపభ్రంశ ఇతి స్మృతాః
శాస్త్రేషు సంస్కృతా దన్య దపభ్రంశత యోదితమ్

సంస్కృతం సర్గబంధాది ప్రాకృతం స్కంధకాదికమ్
ఆసారాదీ న్యపభ్రంశో నాటకాది తు మిశ్రకమ్

కథా హి సర్వభాషాభిః సంస్కృతేన చ బధ్యతే
భూతభాషామయీం ప్రాహు రద్భుతార్థాం బృహత్కథామ్

లాస్య చ్ఛలిత శల్యాది ప్రేక్ష్యార్థ మితర త్పునః
శ్రవ్య మే వేతి సైషాపి ద్వయీ గతి రుదాహృతా.

అస్త్యనేకో గిరాం మార్గః సూక్ష్మభేదః పరస్పరమ్
తత్ర వైదర్భగౌడీయౌ వర్ణ్యేతే ప్రస్ఫుటాంతరౌ

శ్లేషః ప్రసాదః సమతా మాధుర్యం సుకుమారతా
అర్థవ్యక్తి రుదారత్వ మోజః కాంతి సమాధయః

ఇతి వైదర్భమార్గస్య ప్రాణాః దశగుణాః స్మృతాః
ఏషాం విపర్యయః ప్రాయో దృశ్యతే గౌడవర్త్మని

శ్లిష్ట మస్పృష్టశైథిల్య మల్పప్రాణాక్షరోత్తరమ్
శిథిలం మాలతీమాలా లోలాలికలిలా యథా

అనుప్రాసధియా గౌడైః త దిష్టం బంధగౌరవాత్
వైదర్భైః మాలతీదామ లంఘితం భ్రమరై రితి

ప్రసాదవత్ ప్రసిద్ధార్థ మిందో రిందీవరద్యుతి
లక్ష్మ లక్ష్మీం తనో తీతి ప్రతీతిసుభగం వచః

వ్యుత్పన్న మితి గౌడీయై ర్నాతిరూఢ మపీష్యతే
యథా నత్యర్జునాబ్జన్మ సదృక్షాంకో వలక్షగుః

సమం బంధే ష్వవిషమం తే మృదు స్ఫుట మధ్యమాః
బంధా మృదు స్ఫుటోన్మిశ్ర వర్ణవిన్యాసయోనయః

కోకిలాలాపవాచాలో మా మేతి మలయానిలః
ఉచ్ఛల చ్ఛీకరాచ్ఛాచ్ఛ నిర్ఝరాంభః కణోక్షితః

చందనప్రణయోద్గంధి మందో మలయమారుతః
స్పర్ధతే రుద్ధమద్ధైర్యో వరరామాముఖానిలైః.

ఇత్యనాలోచ్య వైషమ్య మర్థాలంకారడంబరౌ
అపేక్షమాణా వవృధే పౌరస్త్యా కావ్యపద్ధతిః

మధురం రసవద్వాచి వస్తున్యపి రసస్థితిః
యేన మాద్యంతి ధీమంతో మధునేవ మధువ్రతాః

యయా కయాచిత్ శ్రుత్యా యత్ సమాన మనుభూయతే
తద్రూపా హి పదాసత్తిః సానుప్రాసా రసావహా

ఏష రాజా యదా లక్ష్మీం ప్రాప్తవాన్ బ్రాహ్మణప్రియః
తతః ప్రభృతి ధర్మస్య లోకే ఽస్మి న్నుత్సవో ఽ భవత్

ఇ తీదం నాదృతం గౌడైః అనుప్రాసస్తు తత్ప్రియః
అనుప్రాసా దపి ప్రాయో వైదర్భై రిద మిష్యతే

వర్ణావృత్తి రనుప్రాసః పాదేషు చ పదేషు చ
పూర్వానుభవసంస్కారబోధినీ య ద్యదూరతా

చంద్రే శరన్నిశో త్తంసే కుందస్తబకవిభ్రమే
ఇంద్రనీలనిభం లక్ష్మ సంధత్యా త్యలినః శ్రియమ్

చారుచంద్రమసం భీరు బింబం పశ్యైత దంబరే
మన్మనో మన్మథాక్రాంతం నిర్దయం హంతు ముద్యతమ్

ఇ త్యనుప్రాస మిచ్ఛ న్తి నాతిదూరాంతరశ్రుతిమ్
న తు రామాముఖాంభోజసదృశ శ్చంద్రమా ఇతి

స్మరః ఖరః ఖల కాంతః కాయః కోపశ్చ నః కృశః
చ్యుతో మానోఽ ధికో రాగో మోహో జాతోఽసవో గతాః

ఇ త్యాది బంధపారుష్యం శైథిల్యం చ నియచ్ఛతి
అతో నైవ మనుప్రాసం దాక్షిణాత్యాః ప్రయుంజతే

ఆవృత్తిం వర్ణసంఘాత గోచరాం యమకం విదుః
తత్తు నైకాంతమధుర మతః పశ్చా ద్విధాస్యతే

కామం సర్వోఽప్యలంకారో రస మర్థే నిషించతి
తథా ప్యగ్రామ్యతై వైనం భారం వహతి భూయసా.

కన్యే కామయమానం మాం న త్వం కామయసే కథమ్
ఇతి గ్రామ్యో ఽయ మర్థాత్మా వైరస్యాయ ప్రకల్పతే

కామం కందర్పచండాలో మయి వామాక్షి నిర్దయః
త్వయి నిర్మత్సరో దిష్ట్యేత్యగ్రామ్యోఽర్థో రసావహః

శబ్దేఽపి గ్రామ్యతాస్త్యేవ సా సభ్యేతరకీర్తనాత్
యథా యకారాదిపదం రత్యుత్సవనిరూపణే

పదసంధానవృత్త్యా వా వాక్యార్థత్వేన వా పునః
దుష్ప్రతీతికరం గ్రామ్యం యథా యా భవతః ప్రియా

ఖరం ప్రహృత్య విశ్రాంతః పురుషో వీర్యవానితి
ఏవమాది న శంసంతి మార్గయో రుభయో రపి.

భగినీ భగవత్యాది సర్వత్రైవానుమన్యతే
విభక్తమితి మాధుర్య ముచ్యతే సుకుమారతా

అనిష్ఠురాక్షరప్రాయం సుకుమార మిహేష్యతే
బంధశైథిల్యదోష స్తు దర్శితః సర్వకోమలే

మండలీకృత్య బర్హాణి కంఠై ర్మధురగీతిభిః
కలాపినః ప్రనృత్యంతి కాలే జీమూతమాలిని.

ఇత్యనూర్జిత ఏవార్థో నాలంకారోఽపి తాదృశః
సుకుమారతయై వైత దారోహతి సతాం మనః

దీప్త మిత్యపరై ర్భూమ్నా కృచ్ఛ్రోద్య మపి బధ్యతే
న్యక్షేణ క్షయితః పక్షః క్షత్రియాణాం క్షణా దితి

అర్థవ్యక్తి రనేయత్వ మర్థస్య హరిణోద్ధృతా
భూః ఖురక్షుణ్ణ నాగాసృక్ లోహితా దుదధే రితి

మహీ మహావరాహేణ లోహితా దుద్ధృతోదధేః
ఇతీయత్యేవ నిర్దిష్టే నేయత్వ మురగాసృజః

నేదృశం బహుమన్యంతే మార్గయో రుభయో రపి
న హి ప్రతీతిః సుభగా శబ్దన్యాయవిలంఘినీ

ఉత్కర్షవాన్ గుణః కశ్చిత్ యస్మిన్నుక్తే ప్రతీయతే
తదుదారాహ్వయం తేన సనాథా కావ్యపద్ధతిః

అర్థినాం కృపణా దృష్టిః త్వన్ముఖే పతితా సకృత్
తదవస్థా పునర్దేవ నాన్యస్య ముఖమీక్షతే

ఇతి త్యాగస్య వాక్యేఽస్మిన్ ఉత్కర్షః సాధు లక్ష్యతే
అనేనైవ పథాన్యత్ర సమానన్యాయమూహ్యతామ్

శ్లాఘ్యైర్విశేషణైర్యుక్తముదారం కైశ్చిదిష్యతే
యథా- లీలాంబుజ క్రీడా సరో హేమాంగదాదయః

ఓజః సమాసభూయస్త్వమేతద్ గద్యస్య జీవితమ్
పద్యేప్యదాక్షిణాత్యానామిదమేకం పరాయణమ్

తద్గురూణాం లఘూనాం చ బాహుల్యాల్పత్వమిశ్రణైః
ఉచ్చావచప్రకారం తత్ దృశ్యమాఖ్యాయికాదిషు

అస్తమస్తకపర్యస్తసమస్తార్కాంశు సంస్తరా
పీనస్తన స్థితా తామ్ర కమ్రవస్త్రేవ వారుణీ

ఇతి పద్యేఽపి పౌరస్త్యా బధ్నంత్యోజస్వినీర్గిరః
అన్యే త్వనాకులం హృద్యమిచ్ఛంత్యోజో గిరాం యథా

పయోధర తటోత్సంగ లగ్న సంధ్యాతపాంశుకా
కస్య కామాతురం చేతో వారుణీ న కరిష్యతి

కాంతం సర్వ జగత్కాంతం లౌకికార్థానతిక్రమాత్
తచ్చ వార్తాభిధానేషు వర్ణనాస్వపి దృశ్యతే

గృహాణి నామ తాన్యేవ తపోరాశిర్భవాదృశః
సంభావయతి యాన్యేవ పావనైః పాదపాంసుభిః

అనయోరనవద్యాంగి స్తనయోః జృంభమాణయోః
అవకాశో న పర్యాప్తః తవ బాహులతాంతరే

ఇతి సంభావ్య మే వైత ద్విశేషాఖ్యాన సంస్కృతమ్
కాంతం భవతి సర్వస్య లోకయాత్రానువర్తినః

లోకాతీత ఇ వాత్యర్థ మధ్యారోప్య వివక్షితః
యోఽర్థ స్తే నాతి తుష్యంతి విదగ్ధా నేతరే జనాః

దేవదిష్ణ్య మి వారాధ్య మద్యప్రభృతి నో గృహమ్
యుష్మత్పాదరజః పాత ధౌత నిశ్శేష కిల్బిషమ్.

అల్పం నిర్మిత మాకాశ మనాలోచ్యైవ వేధసా
ఇద మేవం విధం భావి భవత్యాః స్తన జృంభణమ్

ఇద మత్యుక్తి రిత్యుక్త మేత ద్గాఢోప లాలితమ్
ప్రస్థానం ప్రాక్ ప్రణీతం తు సార మన్యస్య వర్త్మనః

అన్యధర్మ స్తతోఽ న్యత్ర లోకసీమాను రోధినా
సమ్య గాధీయతే యత్ర స సమాధిః స్మృతో యథా

కుముదాని నిమీలంతి కమలా న్యున్మిషంతి చ
ఇతి నేత్రక్రియాధ్యాసా ల్లబ్ధా తద్వాచినీ శ్రుతిః

నిష్ఠ్యూతో ద్గీర్ణ వాంతాది గౌణవృత్తి వ్యపాశ్రయమ్
అతిసుందర మన్యత్ర గ్రామ్యకక్ష్యాం విగాహతే.

పద్మా న్యర్కాంశు నిష్ఠ్యూతాః పీత్వా పావక విప్రుషః
భూయో వమం తీవ ముఖై రుద్గీర్ణారుణ రేణుభిః

ఇతి హృద్య మహృద్యం తు నిష్ఠీవతి వధూ రితి
యుగప న్నైకధర్మాణా మధ్యాస శ్చ స్మృతో యథా

గురుగర్భ భరక్లాంతాః స్తనంత్యో మేఘపంక్తయః
అచలాధిత్యకోత్సంగ మిమాః సమధి శేరతే.

ఉత్సంగశయనం సఖ్యాః స్తననం గౌరవం క్లమః
ఇతీమే గర్భిణీధర్మా బహవోఽ ప్యత్ర దర్శితాః

త దేతత్ కావ్యసర్వస్వం సమాధి ర్నామ యో గుణః
కవిసార్థః సమగ్రోఽపి త మేన మనుగచ్ఛతి.

ఇతి మార్గద్వయం భిన్నం తత్స్వరూపనిరూపణాత్
తద్భేదా స్తు న శక్యంతే వక్తుం ప్రతి కవి స్థితాః

ఇక్షు క్షీర గుడాదీనాం మాధుర్య స్యాంతరం మహత్
తథాఽపి న త దాఖ్యాతుం సరస్వ త్యాపి శక్యతే

నైసర్గికీ చ ప్రతిభా శ్రుతం చ బహు నిర్మలమ్
అమంద శ్చాభియోగోఽస్యాః కారణం కావ్యసంపదః

న విద్యతే య ద్యపి పూర్వవాసనా
గుణానుబంధి ప్రతిభాన మద్భుతమ్
శ్రుతేన యత్నేన చ వా గుపాసితా
ధ్రువం కరో త్యేవ కమ ప్యనుగ్రహమ్

త ద స్తతంద్రై రనిశం సరస్వతీ
శ్రమా దుపాస్యా ఖలు కీర్తి మీప్సుభిః
కృశే కవిత్వేపి జనాః కృత శ్రమాః
విదగ్ధ గోష్ఠీషు విహర్తు మీశతే

మార్గవిభాగో నామ
ప్రథమః పరిచ్ఛేదః



# రు ద్ర టు డు

తొమ్మిదవ శతాబ్దారంభమున ఉన్న రుద్రటుని కావ్యాలంకారము 16 అధ్యాయములలో కావ్యమును సమగ్రముగా విమర్శించినగ్రంథము కావ్య ప్రయోజనములు కవికి కావలసిన శక్తి వ్యుత్పత్తి అభ్యాసము మొదట రుద్రటుడు చెప్పినాడు రెండవ అధ్యాయమున కావ్యలక్షణము, ఐదు శబ్దాలంకారములు నాల్గురీతులు వక్రోక్తి ఐదు వృత్తులు గలవు తర్వాత మూడు అధ్యాయములలో శబ్దాలంకారములు, ఆపైన దోష ములు వివేచింపబడినవి అర్థాలంకారములను ఐదు అధ్యాయములలో చెప్పి పన్నెండవ అధ్యాయమున రసవివేచన మొదలిడినాడు చివరి అధ్యాయ ములో కథ ఆఖ్యాయిక నిర్వచింపబడినవి

వాముక పుత్రుడు సామవేది అగు శతానందుడే రుద్రటుడు అలం కార విభాగమునకు ముఖ్యసూత్రములను మొట్టమొదట ప్రతిపాదించిన రుద్రటుడే ప్రేయస్ అను పదవ రసమును ప్రపంచించెను

భావాలంకారమున అన్యార్థావగమనము కల దనినాడు పరికర, సమాసోక్తి అన్యోక్తి అను అలంకారములలో కూడ ఇట్టి అర్థమే ప్రతీత మగుచున్న దని ధ్వనిని అలంకారాంతర్భాగము చేసినాడు భావాలం కారమున వస్తుధ్వనిని రూపకమున అలంకారధ్వనిని, రసవదాదులలో రస ధ్వనిని రుద్రటుడు అంగీకరించె నని రుయ్యకు డనినాడు

అలంకారములద్వారా ప్రకాశించుచు దోషరహిత మగుటచే నిర్మల మైయున్న వాక్ప్రబంధమును చేయు మహాకవి కావ్యము కల్పాంతము దాక కీర్తింపబడుచుండి అగును ఇట్టి కావ్యము తెచ్చు కీర్తి సకలలోక కమ నీయము ధనము అనర్థముల ఉపశమము సుఖము మొద లగు ఇహలోక ఫలములు మోక్షము మొద లగు అనేక ప్రయోజనములను కావ్య మొసగ గలదు పదవాక్య ప్రమాణజ్ఞు డగు కవికి కలుగు వాక్సంస్కారమునకు ఫలము సుందరకావ్యమును రచించుటయే దోషత్యాగము గుణాలంకార గ్రహణము చారుత్వగుణోపేతము నగు కావ్యమును రచించుటలో శక్తి, వ్యుత్పత్తి అభ్యాసము అను వ్యాపారములు కనిపించును.

అనేక ప్రకార మగు వాక్యార్థము చిత్తమున స్ఫురించుటయే శక్తి. అప్పుడు త్వరగా అర్థమును ప్రతిపాదించుటకై సమర్థత గల పదములు రాగలవు కనుక శక్తిద్వారా కావ్యము హృదయంగమ మగును ఇతరులు దీనివి ప్రతిభ అనిరి ఛందము, వ్యాకరణము స్మృత్యాదికళలు చరాచరాది స్వరూపనియమము శబ్దకోశము శబ్దార్థము అను ఆరెంటిని తెలిసికొనుటచే కలుగు యుక్తాయుక్త వివేకమును వ్యుత్పత్తి అందురు

తుల్యప్రాధాన్యము కల శబ్దార్థముల కలయిక కావ్యము అర్థవంతమైన శబ్దము వర్ణములతో కూడినది వాక్యరచనకు ఎట్టి శబ్దములు సౌందర్యమును చేకూర్పగలవో వానినే రచింపవలెను రచనాచారుత్వమున్న నే సంనివేశ చారుత్వ మను శబ్దగుణము రాగలదు

కావ్యముద్వారా పురుషార్థములు నరసులకు అవగతములు కాగలవు శాస్త్రములు కటువుగా చెప్పగలవు కాని కావ్యము మృదువుగా బోధింపగలదు ఈ ప్రయోజనము నెరవేర వలె ననిన కావ్యమును రసవంతముగా చెప్పవలెను శబ్దార్థశరీరము గల కావ్యమునకు వక్రోక్తి మొద లగునవి కటక కుండలాదులవలె కృత్రిమము లగు అలంకారములు సౌందర్యాదులవలె రసములు సహజగుణములు శృంగారము వీరము, కరుణ బీభత్సము భయానకము, అద్భుతము, హాస్యము రౌద్రము శాంతము ప్రేయాన్ అవి పది రసము లున్నవి స్థాయిభావము లాస్వాదింప బడున వగుటచే వీనికి రసత్వమును భరతుడు మొద లగువారు చెప్పివారు. నిర్వేదాది సంచారిభావములు కూడ ఆస్వాదింపబడున వగుటచే ఇవి కూడ రసములుగా పరిణమించగలవు

రుద్రటస్య కావ్యాలంకార

జ్వలదుజ్జ్వల వాక్ప్రసరః సరసం కుర్వన్ మహాకవిః కావ్యమ్
స్ఫుట మాకల్ప మనల్పం ప్రతనోతి యశః పర స్యాపి. 1.4

అర్థ మనర్థోపశమం శమసమ మథవా మతం యదే వాస్య
విరచిత రుచిర సురస్తుతి రఖిలం లభతే తదేవ కవి . 18

ఫల మిద మేవ హి విదుషాం శుచిపద వాక్య ప్రమాణ శాస్త్రేభ్యః
యత్సంస్కారో వాచాం వాచ శ్చ సుచారుకావ్యఫలాః 1.13

తస్యా సారనిరాసా త్సార గ్రహణా చ్చ చారుణః కరణే
త్రితయ మిదం వ్యాప్రియతే శక్తి ర్వ్యుత్పత్తి రభ్యాసః 1 14

మనసి సదా సుసమాధిని విస్ఫురణ మనేకధాభిధేయస్య
అక్లిష్టాని పదాని చ విభాంతి యస్యా మసౌ శక్తిః 1.15

త్రివిధే త్యపరై రుదితా 1 16

ఛందో వ్యాకరణ కలా లోకస్థితి పదపదార్థవిజ్ఞానాత్
యుక్తాయుక్తవివేకో వ్యుత్పత్తి రియం సమాసేన 1.18

నను శబ్దార్థౌ కావ్యం శబ్ద స్తత్రార్థవా ననేకవిధః
వర్ణానాం సముదాయః 2.1

రచయే త్తమేవ శబ్దం రచనాయా యః కరోతి చారుత్వమ్ 2 9

నను కావ్యేన క్రియతే సరసానా మవగమ శ్చతుర్వర్గే
లఘు మృదు చ నీరసేభ్య స్తే హి త్రస్యంతి శాస్త్రేభ్యః 12 1

తస్మా త్తత్కర్తవ్యం యత్నేన మహీయసా రసై ర్యుక్తమ్
ఉద్వేజన మేతేషాం శాస్త్రవ దేవాన్యథా హి స్యాత్ 12.2

శృంగార వీర కరుణా బీభత్స భయానకాద్భుతా హాస్యః
రౌద్రః శాంతః ప్రేయా నితి మంతవ్యా రసాః సర్వే 12 3

రసనా ద్రసత్వ మేషాం మధురాదీనా మివోక్త మాచార్యైః
నిర్వేదాది ష్వపి తన్నికామ మస్తీతి తేఽపి రసాః 12 4

# వా మ నా చా ర్యు డు

ఆచార్య వామనుడు మాఘ, భవభూతులకు తరువాతివాడు. కాశ్మీరప్రభు వగు జయాపీడుని ( క్రీ.శ 779-818 ) మంత్రి వామను డని కల్హణుడు రాజతరంగిణిలో చెప్పినాడు కాశికావృత్తి రచయితలలోనిత డన్యతముఁడు కానోపును కావున నీతడు క్రీ శ 800 ప్రాంతమువాడు వామనునకు కొలదిగా జైన బౌద్ధధర్మములయెడల ప్రీతి యున్నట్లు కనిపించును

వామనుడు తొలుత కావ్యాలంకార సూత్రములను రచించి వానికి తానే వృత్తి నమకూర్చినాడు ఈ గ్రంథమున అయిదు అధికరణములు కలవు మొదటిమూ డధ్యాయములలో కావ్యప్రయోజనము అధికారులు కావ్యలక్షణము రీతి తద్భేదములు కావ్యమున కుపకరించు అంశములు కావ్యభేదములు వర్ణింపబడినవి ద్వితీయాధికరణమున దోషములు తృతీయమున గుణములు చెప్పబడినవి ఈ రెండధికరణములలో నొక్కొక్క దానిలో రెండురెం డధ్యాయములు చతుర్థాధికరణమున మూడధ్యాయములున్నవి ఇం దలంకారములు చర్చింపబడినవి పంచమాధికరణము నందలి రెండధ్యాయములలో కొన్ని కవిసమయములు కొన్ని శబ్దముల పరిశుద్ధి కొన్నిప్రయోగముల సాధుత్వము నిరూపింపబడినవి

గుణాలంకార సహితము లయినశబ్దార్థములే కావ్యము అలంకార ముండుటచేతనే కావ్యము శ్రవణయోగ్యము సౌందర్యమే అలంకారము కావ్యము దోషరహితము కావలెను

కావ్యాత్మ ఏది యని ప్రశ్నించి రీతి కావ్యాత్మ అని వామనాచార్యుడు నిర్ణయించినాడు రీతి యనగా పదసంఘటనా విశేషము. అది గుణాధారము వైదర్భీరీతిలో పది గుణములు గౌడీయరీతిలో ఓజస్సు కాంతి పాంచాలీరీతిలో మాధుర్య సౌకుమార్యములు నుండు నన్నాడు దశ గుణము లుండుటచే వైదర్భి ఉత్తమ మైనది విదర్భ, గౌడ పాంచాల దేశ కవుల రచనలను బట్టి రీతుల కి పేరులు పెట్టినాడు

దోషములను గుణవ్యతిరేకము లని (గుణవిపర్యాయాత్మనో దోషాః) అన్నాడు వామనుడు దోషములు నాలుగువిధములు. శబ్దమున అర్థమున, వాక్యమున వాక్యార్థమున దోష ముండును మమ్మటాచార్యుడు కూడ నీవిభాగమును చాలవర కంగీకరించినాడు.

వామనునకు పూర్వమే దశగుణములు చెప్పబడినవి ఈయన వీని నంగీకరించి శబ్ద గుణము లనియు అర్థ గుణము లనియు మరల విభాగము చేసినాడు ఆనంద వర్ధనాచార్యు ననుసరించి మమ్మటాచార్యుడు గుణములు నిజముగా రసమునకు సంబంధించిన వని స్పష్టీకరించినాడు

గుణాలంకారములకు విభేదమును స్పష్టముగా తొలుత నిరూపించినవాడు వామనాచార్యుడు "కావ్యశోభాకరా ధర్మాః అని ఆచార్య దండి అలంకార సామాన్య లక్షణము చెప్పినాడు. కావ్యసౌందర్య కారకములు గుణము లనియు ఉపమాద్యలంకారము లాసౌందర్యమును వృద్ధి చేయు ననియు వామను డన్నాడు కావ్యమున గుణములు విడువ రాని వనియు, అలంకారములు ద్వితీయ శ్రేణికి చెందిన వనియు పలికినాడు

వామనమతమున యమకము అనుప్రాసము అను రెండే శబ్దాలంకారములు అర్థాలంకారము లన్నిటికిని ఉపమయే ఆధారము. స్వభావోక్తిని రసవదలంకారమును గుణములలో చేర్చినాడు వామనుని ఆక్షేపాలంకారమును తరువాతి ఆలంకారికులు సమాసోక్తిగానో ప్రతీపాలంకారముగానో గ్రహించినారు. వక్రోక్తిని అలంకారముగా మొదట గ్రహించినవాడు వామనుడు.

వామనుని రీతి దండ్యాచార్యుని మార్గవిభాగమువలె నుండును. తరువాతివా రారీతి నంగీకరించినను దానిని కావ్యాత్మగా భావింపలేదు. అలంకారములు కావ్యశరీరమునకు సంబంధించిన వని యింత గాఢముగా వివేచించి ఈయన సిద్ధాంతముతో సంతృప్తి నొందలేదు

ఆనందమే కావ్యమునకు పరమప్రయోజన మని నవ్యోదయు లన్నారు. కావ్యరచనకు ప్రతిభ ప్రధానము; అయినను వ్యుత్పత్తి, కవిశిక్ష లోకావేక్షణముకూడ కావలయు నన్నారు

సంస్కృతాలంకారికులు పద్యమాత్రమునకు, కావ్యత్వమునకును భేదము గమనించినవారు కావ్యము రసవంతమై కాంతాసమ్మితముగా ధర్మబోధ చేయవలె నని వారియాశయము

ఆచార్య వామనస్య
కావ్యాలంకార సూత్రవృత్తిః

1

1 కావ్యం గ్రాహ్య మలంకారాత్.

కావ్యం ఖలు గ్రాహ్య ముపాదేయం భవతి అలంకారాత్ కావ్య శబ్దోఽయం గుణాలంకార సంస్కృతయోః శబ్దార్థయోః వర్తతే భక్త్యా తు శబ్దార్థమాత్రవచనోఽత్ర గృహ్యతే.

కోఽసావలంకార ఇత్యత ఆహ

2. సౌందర్య మలంకారః.

అలంకృతి రలంకారః. కరణవ్యుత్పత్త్యా పున రలంకారశబ్దోఽయ ముపమాదిషు వర్తతే

3 స దోష గుణాలంకార హానాదానాభ్యామ్.

స ఖ ల్వలంకారో దోషహానాత్, గుణాలంకారాదానా చ్చ సంపాద్యః కవేః

4 శాస్త్రత స్తే.

తే దోషగుణాలంకార హానాదానే శాస్త్రా దస్మాత్. శాస్త్రతో హి జ్ఞాత్వా దోషాన్ జహ్యాత్ గుణాలంకారాన్ చ ఆదదీత.

కిం పునః ఫల మలంకారవతా కావ్యేన, యే నైతదర్థోఽయం యత్న ఇత్యత ఆహ :

5 కావ్యం సత్ దృష్టాదృష్టార్థం ప్రీతి కీర్తి హేతుత్వాత్

కావ్యం సత్ చారు దృష్టప్రయోజనం, ప్రీతిహేతుత్వాత్. అదృష్ట ప్రయోజనం కీర్తిహేతుత్వాత్. అత్ర శ్లోకాః

ప్రతిష్ఠాం కావ్యబంధస్య యశసః సరణిం విదుః
అకీర్తివర్తనీం త్వేతాం కుకవిత్వవిడంబనామ్.

కీర్తిం స్వర్గఫలా మాహు రాసంసారం విపశ్చితః
అకీర్తిం తు నిరాలోక నరకోద్దేశ దూతికామ్.

తస్మాత్ కీర్తి ముపాదాతు మకీర్తిం చ వ్యపోహితుమ్
కావ్యాలంకార శాస్త్రార్థః ప్రసాద్యః కవిపుంగవైః.

2

ప్రయోజనస్థాపనా అధికారినిరూపణార్థ మాహ

1 అరోచకినః సతృణాభ్యవహారిణ శ్చ కవయః.

ఇహ ఖలు ద్వయే కవయః సంభవంతి. అరోచకినః సతృణాభ్యవహారిణ శ్చేతి అరోచకి సతృణాభ్యవహారిశబ్దౌ గౌణార్థౌ కోఽసావర్థః? వివేకిత్వ మవివేకిత్వం చేతి

య దాహ-

2 పూర్వే శిష్యాః, వివేకిత్వాత్.

పూర్వే ఖ ల్వరోచకినః శిష్యాః శాసనీయాః, వివేకిత్వాత్ వివేచనశీలత్వాత్

3 నేతరే తద్విపర్యయాత్.

ఇతరే సతృణాభ్యవహారిణః, న శిష్యాః తద్విపర్యయాత్ అవివేచనశీలత్వాత్ న చ శీల మపాకర్తుం శక్యమ్.

న న్వేవం న శాస్త్రం సర్వానుగ్రాహి స్యాత్, కో వా మన్యతే? త దాహ-

4 న శాస్త్ర మద్రవ్యే ష్వర్థవత్

న ఖలు శాస్త్రం అద్రవ్యేషు అవివేకిషు అర్థవత్. నిదర్శన మాహ-

5. న కతకం పంకప్రసాదనాయ.

న హి కతకం పయస ఇవ పంకస్య ప్రసాదనాయ ప్రభవతి.

అధికారిణో నిరూప్య రీతి వినిశ్చయార్థ మాహ-

6. రీతి రాత్మా కావ్యస్య.

రీతి ర్నామ ఇయ మేవ ఆత్మా కావ్యస్య. శరీర స్యే వేతి వాక్యశేషః.

కిం పున రియం రీతి రి త్య త్రాహ-

7. విశిష్టా పదరచనా రీతిః.

విశేషవతీ పదానాం రచనా రీతిః.

కోఽసౌ విశేష ఇ త్యత ఆహ-

8. విశేషో గుణాత్మా.

వక్ష్యమాణ గుణరూపో విశేషః.

9. సా త్రేధా, వైదర్భీ, గౌడీయా, పాంచాలీ చేతి.

సా చేయం రీతిః త్రివిధా భిద్యతే- వైదర్భీ, గౌడీయా, పాంచాలీ చేతి.

కిం పున ర్దేశవశాత్ ద్రవ్యవ ద్గుణోత్పత్తిః కావ్యానాం, యే నాయం దేశవిశేష వ్యపదేశః ? నైవమ్. య దాహ-

10. విదర్భాదిషు దృష్టత్వాత్ తత్త్సమాఖ్యా.

విదర్భ, గౌడ, పాంచాలేషు దేశేషు తత్రత్యైః కవిభిః యథా స్వరూప ముపలబ్ధత్వాత్ దేశసమాఖ్యా, న పున ర్దేశైః కించి దుప క్రియతే కావ్యానామ్.

తాసాం గుణభేదా ద్భేదమాహ-

11. సమగ్రగుణోపేతా వైదర్భీ.

సమగ్రైః ఓజః ప్రసాదప్రభృతిభిః గుణైః ఉపేతా వైదర్భీనామ రీతిః. అత్ర శ్లోకాః-

అస్పృష్టా దోషమాత్రాభిః సమగ్రగుణగుంభితా
విపంచీస్వరసౌభాగ్యా వైదర్భీ రీతి రిష్యతే

తా మేతా మేవం కవయః స్తువంతి

సతి వక్తరి స త్యర్థే సతి శబ్దానుశాసనే
అస్తి త న్న వినా యేన పరిస్రవతి వాఙ్మధు

ఉదాహరణమ్

గాహంతాం మహిషా నిపానసలిలం శృంగై ర్ముహు స్తాడితం,
ఛాయాబద్ధకదంబకం మృగకులం రోమంథ మభ్యస్యతు,
విస్రబ్ధైః క్రియతాం వరాహపతిభిః ముస్తాక్షతిః పల్వలే
విశ్రాంతిం లభతా మిదం చ శిథిలజ్యాబంధ మస్మద్ధనుః.

12 ఓజః కాంతిమతీ గౌడీయా

ఓజః కాంతి శ్చ విద్యేతే యస్యాం సా ఓజఃకాంతిమతీ గౌడీయా నామ రీతిః మాధుర్య సౌకుమార్యయో రభావాత్ సమాసబహులా అత్యుల్బణపదా చ అత్ర శ్లోకః

సమస్తా త్యుద్భటపదా మోజః కాంతి గుణాన్వితామ్
గౌడీయా మపి గాయంతి రీతిం రీతివిచక్షణాః.

ఉదాహరణమ్

దోర్దండాంచిత చంద్రశేఖరధను ర్దండావభంగోద్యత
ష్టంకారధ్వని రార్యబాలచరిత ప్రస్తావనా డిండిమః
ద్రా క్పర్యస్తకపాలసంపుట మిత బ్రహ్మాండభాండోదర
భ్రామ్యత్పిండితచండిమా కథ మహో నాద్యాపి విశ్రామ్యతి.

13 మాధుర్య సౌకుమార్యోపపన్నా పాంచాలీ

మాధుర్యేణ సౌకుమార్యేణ చ గుణే నోపపన్నా పాంచాలీ నామ రీతిః ఓజః కాంత్యభావాత్ అనుల్బణపదా విచ్ఛాయా చ

తథా చ శ్లోకః

ఆశ్లిష్టశ్లథభావాం తు పురాణచ్ఛాయ యాన్వితామ్
మధురాం సుకుమారాం చ పాంచాలీం కవయో విదుః.

అత్రోదాహరణమ్

గ్రామే ఽస్మిన్ పథికాయ పాంథ, వసతిః నై వాధునా దీయతే
రాత్రా వత్ర విహారమండపతలే పాంథః ప్రసుప్తో యువా
తే నోత్థాయ ఖలేన గర్జతి ఘనే స్మృత్వా ప్రియాం తత్కృతం
యే నాద్యాపి కరంకదండపతనాశంకీ జన స్తిష్ఠతి
ఏతాసు తిసృషు రీతిషు రేఖాస్వివ చిత్రం కావ్యం ప్రతిష్ఠిత మితి

14 తాసాం పూర్వా గ్రాహ్యా గుణసాకల్యాత్.

తాసాం తిసృణాం రీతీనాం పూర్వా వైదర్భీ గ్రాహ్యా గుణానాం సా ల్యాత్

5 న పున రితరే స్తోకగుణత్వాత్

ఇతరే గౌడీయ పాంచాల్యౌ న గ్రాహ్యే స్తోకగుణత్వాత్

16 తదారోహణార్థ మితరాభ్యాస ఇ త్యేకే

తస్యా వైదర్భ్యా ఏ వారోహణార్థ మితరయో రపి రీత్యో రభ్యాస ఇ త్యేకే మన్యంతే

17 త చ్చ న; అతత్త్వశీలస్య త త్త్వానిష్పత్తేః

న హ్యతత్త్వం శీలయత స్తత్త్వం నిష్పద్యతే.

నిదర్శనార్థ మాహ-

1౮ న శణసూత్రవానాభ్యాసే త్రసరసూత్ర
వాన వైచిత్ర్య లాభః.

న హి శణసూత్రవాన మభ్యస్యన్ కువిందః త్రసర తంతువాన వైచిత్ర్యం లభతే

19 సాపి సమాసాభావే శుద్ధవైదర్భీ.

సాపి వైదర్భీరీతిః శుద్ధవైదర్భీ భణ్యతే యది సమాసవత్పదం న భవతి

20 తస్యా మర్థగుణసంప దాస్వాద్యా

తస్యాం వైదర్భ్యాం అర్థగుణసంపత్ ఆస్వాద్యా భవతి

21 త దుపారోహా దర్థగుణవేశో౽పి

త దుపధారతః ఖలు అర్థగుణవేశో౽పి స్వదతే కి మంగ పున రర్థగుణసంపత్ తథా చాహుః-

"కిం త్వస్తి కాచి దప రైవ పదానుపూర్వీ
యస్యాం న కించి దపి కించి ది వావభాతి"

"వచసి య మధిశయ్య స్యందతే వాచక శ్రీః
వితథ మవితథత్వం యత్ర వస్తు ప్రయాతి
ఉదయతి హి స తాదృ క్క్వాపి వైదర్భరీతౌ
సహృదయహృదయానాం రంజకః కో౽పి పాకః

22 సాపి వైదర్భీ తాత్స్థ్యాత్

సాపి ఇయ మర్థగుణసంప ద్వైదర్భీ త్యుచ్యతే తాత్స్థ్యాత్ ఇ త్యుపచారతో వ్యవహారం దర్శయతి

ఇతి కావ్యాలంకార సూత్రవృత్తౌ శారీరే
ప్రథమే౽ధికరణే ద్వితీయో౽ధ్యాయః

---

# ఉ ద్భ ట  భ ట్టు

భామహవివరణము, అలంకార సారసంగ్రహము రచించిన ఉద్భటుడు ఎనిమిదవ శతాబ్దమువాడు తొమ్మిదవ శతాబ్దాంతమున గల ముకులుని శిష్యుడగు ప్రతీహారేందురాజు కావ్యాలంకార సారసంగ్రహమును వ్యాఖ్యానించెను ఉద్భటుని అలంకార సార సంగ్రహమే నేడు లభించు చున్నది ఇందు కేవలము అలంకారములే వివరింపబడినవి

భామహాదులవలె ఉద్భటుడు కూడ కావ్యమున ప్రధాన మైనవి అలంకారము లని గ్రహించినాడు రసముల ప్రాధాన్యము నాట్యమున అని పల్కినాడు భామహుని అనుసరించి అలంకారములే కావ్యమున గల ప్రధాన విషయ మని భావించి, వీనిని సాకల్యముగా నిరూపించెను.

ఉద్భటుని ఇతరగ్రంథములను తర్వాతి రచయితలు ప్రస్తుతించుచు వచ్చినారు కావ్యము శాస్త్రముకన్నను, ఇతిహాసముకన్నను భిన్నమైన దని ఈ భిన్నతకు కావ్యమున గల శబ్దార్థ వైశిష్ట్యమే కారణమని ఉద్భటు డనినా డట! శబ్దార్థములకు గల తుల్యప్రాధాన్యమే కావ్యము నకు కావ్యత్వము నాపాదించునది

శబ్దము వేరు అభిధానము వేరు అని భావించి అభిధావృత్తినే గాక, గౌణవృత్తినికూడ ఉద్భటుడు తన భామహవివరణలో చెప్పినట్లు ఆనంద వర్ధను డనినాడు

అలంకారములను గుణములను పర్యాయపదములుగా గ్రహించిన వాడు ఉద్భటు డని అలంకారసర్వస్వమున రుయ్యకు డనినాడు. పర్యా యోక్తాలంకారమున అవగమకార్థము కలదని ఉద్భటుడు ధ్వనిని అలం కారాంతర్భావముగా గ్రహించెను

ఉద్భటుని మతమున రసమునకు స్వశబ్దవాచ్యత్వము దోషము కాదు

## ఉద్భటస్య
## కావ్యాలంకార సారసంగ్రహః

శాస్త్రేతిహాసవైలక్షణ్యంతు కావ్యస్య శబ్దార్థవైశిష్ట్యా దేవ, నాభిధా వైశిష్ట్యా దితి భట్టోద్భటాదీనాం సిద్ధాంతః (వ్యక్తివివేకటీకా 4)

ఉద్భటాదిభిస్తు గుణాలంకారాణాం ప్రాయశః సామ్య మేవ సూచితమ్ త దేవ మలంకారా ఏవ కావ్యే ప్రధాన మితి ప్రాచ్యానాం మతమ్ (అలంకార సర్వస్వమ్ 9)

గుణవృత్త్యా కావ్యేషు వ్యవహారం దర్శయతా ధ్వనిమార్గో మనాక్ స్పృష్టోఽపి న లక్ష్యత ఇతి పరికల్ప్యైవ ముక్తం (ధ్వ-32-33)

భామహేనోక్తం శబ్దశ్ఛన్దోఽభిధానార్థః ఇత్యభిధానస్య శబ్దా ద్భేదం వ్యాఖ్యాతుం భట్టోద్భట్ బభాషే శబ్దానా మభిధాన మభిధావ్యాపారః ముఖ్యో గుణవృత్తిశ్చ ఇతి (లో 32)

శృంగార హాస్య కరుణ రౌద్ర వీర భయానకాః
బీభత్సాద్భుత శాంతాశ్చ నవ నాట్యే రసాః స్మృతాః 4 5

అన్యత్ర వాచ్యత్వేన ప్రసిద్ధో యో రూపకాది రలంకారః సోఽన్యత్ర ప్రతీయమానతయా బాహుల్యేన ప్రదర్శితః తత్రభవద్భిః భట్టోద్భటాదిభిః (ధ్వన్యా 258)

వాచ్యాలంకారవిశేషవిషయే వ్యంగ్యాలంకారవిశేషో భాతీ త్యుద్భటాదిభి రుక్త మేవేత్యర్థశక్త్యా అలంకారో వ్యజ్యత ఇతి తై రుపగత మేవ (లో. 259)

## కావ్యాలంకార సంగ్రహః

పర్యాయోక్తం య దన్యేన ప్రకారే ణాభిధీయతే
వాచ్యవాచకవృత్తిభ్యాం శూన్యే నావగమాత్మనా 4 11

శ్రుత్యా సంబంధవిరహా ద్యత్పదేన పదాంతరమ్
గుణవృత్తిప్రధానేన యుజ్యతే రూపకం తు తత్ 1 21

రసవద్దర్శితస్పష్టశృంగారాదిరసోదయమ్
స్వశబ్దస్థాయి సంచారి విభావాభినయాస్పదమ్ 4 4

శృంగారహాస్య కరుణ రౌద్ర వీర భయానకాః
బీభత్సాద్భుత శాంతాశ్చ నవ నాట్యే రసాః స్మృతాః 4 5

---

# లోల్లట భట్టు

స్థాయి అగు చిత్తవృత్తిని ఉత్పన్నము చేయుటలో విభావము కారణ మగుచున్నది విభావానుభావాదులచే ఉపచిత మైన స్థాయిభావమే రస మగుచున్నది వివిధ వ్యంజన పదార్థములు కలియగా వాని కన్నిటికి విశిష్ట మైన రుచి వచ్చుచున్నది ఇట్లే విభావాదులు కలియగా స్థాయిభావము రసముగా పరిణమించుచున్నది వ్యభిచారిభావములు స్థాయివంటి చిత్తవృత్తులు కావు. కాని వాసనాత్మకములుగా, సంస్కారరూపములుగా స్థాయియందు ఇవి కలవు. రసము వీని ద్వారా స్థాయినుండి ఉత్పన్న మగు నది విభావములవలన జన్మించి అనుభావములవలన ప్రతీతిపథమునకు కొనిపోబడి వ్యభిచారిభావములచే ఉపచితమై ముఖ్యవృత్తిద్వారా నాటకమున పాత్రలో తద్రూప తానుసంధానవశమున నటునియందు ప్రతీయమాన మగు స్థాయియే రసము

భట్టలోల్లటుడు :

అ భా. 1 272

భట్ట లోల్లట ప్రభృతయ స్తావ దేవం వ్యాచఖ్యుః విభావాదిభిః సంయోగో౽ర్థాత్ స్థాయిన స్తతో రసనిష్పత్తిః తత్ర విభావ శ్చిత్తవృత్తేః స్థాయ్యాత్మికాయా ఉత్పత్తౌ కారణమ్ అనుభావాః వ్యభిచారిణ శ్చ చిత్తవృత్త్యాత్మకత్వాత్ యద్యపి న సహభావినః స్థాయినా, తథాపి వాసనాత్మ నేహ తస్య వివక్షితాః దృష్టాంతేపి వ్యంజనాదిమధ్యే కస్యచిద్వాసనాత్మకతా స్థాయివత్ అన్య స్యోద్భూతతా వ్యభిచారివత్ తేన స్థాయ్యేవ విభావానుభావాదిభి రుపచితో రసః చిరంతనానాం చాయమేవ పక్షః తథా హి దండినా స్వాలంకారలక్షణే౽భ్యధాయి

కావ్య మీమాంసా 141-142

'అస్తు నామ నిస్సీమార్థసార్థః కింతు రసవత ఏవ నిబంధో యుక్తో న నీరసస్య ఇతి అపరాజితిః యదాహ- మజ్జన పుష్పావచయన సంధ్యాచంద్రోదయాదివాక్య మిహ సరస మపి నాతిబహులం ప్రకృతరసానన్వితం రచయేత్. యస్తు సరిదద్రిసాగర పురతురగరథాదివర్ణనే యత్నః కవి శక్తి ఖ్యాతిఫలో వితతధియాం నో మతః స ఇహ'

# ఆనందవర్ధనాచార్యుడు

ధ్వన్యాలోకమున కారికలు వృత్తియు కలవు ఈ కారికలను అతిప్రాచీన సమీక్షక మూర్ధన్యు డెవరో రచించెను వీనిపై మనోరథుని వృత్తి ఉండె డిది అది ఇప్పుడు అలభ్యము ఆనందవర్ధనుని వృత్తియే ఇప్పుడు దొరకు నది. దీనిపై అభినవుని వంశమున పూర్వు డొకడు చంద్రిక అను వ్యాఖ్యను రచించెను భట్టనాయకుడు ఆనందవర్ధనుని వాదమును తన సహృదయ దర్పణమున పూర్తిగా ఖండించినట్లు కనబడుచున్నది తోతభట్టు ఈ గ్రంథ మును తన శిష్యు డగు అభినవగుప్తునకు పాఠము చెప్పెను అభినవుని కావ్యాలోక లోచనము సాహిత్య శాస్త్రమున ప్రధానపాత్ర వహించినది

ఆనందవర్ధనుడు తార్కికుడు, మీమాంసకుడు వైయాకరణుడు ధర్మోత్తరుడు రచించిన వినిశ్చయ మను బౌద్ధ గ్రంథముపై ఆనందవర్ధ నుడు వ్యాఖ్య వ్రాసినట్లు కన్పించుచున్నది తత్త్వాలోక మను వేదాంత గ్రంథ మొకటి ఈయన రచనలలోనిది తొమ్మిదవ శతాబ్దమునకు చెందిన ఆనందవర్ధనుని గ్రంథము ఆలంకారిక సరణి వ్యవస్థాపక మని జగన్నాథు డనినాడు కావ్యలక్షణాది విషయములలో సమీక్షకు లవలంబింపవలసిన నియమావళి ఇచట సుప్రతిష్ఠిత మైన దని తర్వాతి ఆలంకారికుల అభిప్రా యము.

ధ్వన్యాలోక కారికలలో ధ్వనివాదము రససిద్ధాంతముకూడ కన్పించుచున్నవి రసమును ప్రధానముగా గ్రహించుటచే ఈ కారిక లను ఒకచోట వృత్తిని వేరొకచోట ఇచ్చుట అవసరము ఒక కావ్యమును పూర్తిగా సమీక్షచేసిన మొదటి సమీక్షకుడు ఆనందవర్ధనుడు

కొందరు ధ్వని అనునది లే దనిరి. వేరొక కొందరు ధ్వనిని లక్షణగా గ్రహించిరి ఇతరులు ధ్వని అనిర్వచనీయ మని కేవలము ఆస్వాదనీయ మని పల్కిరి. ధ్వనియే కావ్యాత్మ అని కావ్యతత్త్వము నెరిగినవా రని నట్లు ధ్వన్యాలోకకారుడు పల్కినాడు సత్కవుల కావ్యములలో అంత ర్లీనముగా ఉండి అతిరమణీయముగా నున్న ధ్వని స్వరూపము రామా

యణ, మహాభారతాది కావ్యములలో ప్రసిద్ధి చెందియున్నది. ఈ ధ్వని సహృదయులకు ఆనందమును చేకూర్చుచున్నది

సహృదయులచే కావ్యాత్మ అని శ్లాఘింపబడిన అర్థము వాచ్య మని ప్రతీయమాన మని రెండురకముల గలదు మహాకవుల వాక్కులో, వాచ్యార్థముకన్న భిన్న మైన ప్రతీయమానార్థ మున్నది ప్రసిద్ధ మగు అలంకారములకన్న, ఇతర కావ్యావయవములకన్నను భిన్న మైన ఈ అర్థము సహృదయ సుప్రసిద్ధము. ఇది స్త్రీలలో లావణ్యమువలె కావ్యమున ప్రకాశించునది

ప్రతీయమాన మగు అర్థమే కావ్యాత్మ. అలౌకిక మగు ప్రతిభా విశేషము మహాకావ్యమున స్ఫురించును ఇట్టి స్ఫురణ గల మహాకావ్య ములు కొద్ది మహాకవులుకూడ కొలదిమందియే. కాళిదాసాదులు ఐదారుగురే మహాకవులు గల రని ఆనందవర్ధనుడు. ఈ ఐదారుగురిలో వ్యాసుడు, వాల్మీకి ఉన్నారు.

మహాకావ్యమున అభివ్యక్త మగు భావము శబ్దజ్ఞాన మున్నంత మాత్రమున అవగతము కాదు. కావ్యార్థ తత్త్వము నెరిగినవానికే ఇది బోధపడగలదు. కేవల శబ్దార్థజ్ఞాన మిచట సరిపోదు. వ్యంజిత మైన అర్థము ఈ అర్థమును సూచించుశక్తి గల శబ్దము అనునవి మాత్రమే మహాకవి రచనలో గల శబ్దార్థములు అందుచే వ్యంగ్యవ్యంజక సంబంధము గల శబ్దార్థములను చక్కగా ప్రయోగించుటలోనే కన్పించును మహాకవిత్వము. వాచ్యవాచక రచనామాత్రమున ఎవడును మహాకవి కాలేడు వాచ్యవిశేష మగు అర్థము కాని వాచక విశేష మగు శబ్దము గాని ఏ కావ్య అర్థమును అభివ్యక్తము చేయునో ఆ కావ్యవిశేషమే ధ్వని. వాచ్య వాచకములకు సౌందర్యమును తీసికొని వచ్చు అర్థాలంకారములకంటెను, శబ్దాలంకారములకంటెను గూడ భిన్న మైనది ధ్వని అని భావము

కావ్యవిశేష మైన ధ్వని అంగి దీని అంగములుగా అలంకారములు, గుణములు వృత్తులు కలవు అవయవములుగా మండు గుణాదులను అవ యవిగా గ్రహింప వీలు లేదు. అవయవి ఐన ధ్వనిని వైయాకరణులు స్ఫోట అనిరి. శబ్దము గల అక్షరములు స్ఫోటకు అభివ్యంజకములు ఈ వ్యంజ

కత్వ మను పోలిక ఉండుటచే స్ఫోటను వ్యాకరణ విద్వాంసులు ధ్వని అనిరి. కావున ధ్వని అనునది కల దని సిద్ధాంతము. అలంకారాదులు చారుత్వహేతువులు మాత్రమే అగుటచే, వానిని కావ్యాత్మగా గ్రహింప వీలు లేదు ఈ అలంకారాదులు విభావాదులలో పర్యవసితము లైనచో వానికి రసాదితాత్పర్యమే రాగలదు కనుక ఇట్టి పరిస్థితిలో రసధ్వనియే కావ్యాత్మ అగుచున్నది

కావ్యరచన చేయుకవి పూర్తిగా రసపరతంత్రుడు కాలేడు. ఇతి వృత్తము రసమునకు అనుగుణముగా లేనిచో, దానిని మార్చి రసానుగుణ ముగా చేయవచ్చును ఇతిహాసాదులలో ఇతివృత్తము చెప్పబడి యుండు టచే కావ్యమున కేవలము ఇతివృత్తమును ప్రదర్శించుటయే కవి ప్రయో జనము కాజాలదు నాటకమున గల ఐదు సంధులను వాని అంగములను కవి సమకూర్చుటలో రసాభివ్యక్తియే అతవి ముఖ్యోద్దేశము కావలెను రత్నావళిలో ఈ ఉద్దేశము నెరవేరుచున్నది వేణీసంహారమున ఈ సంధ్యంగములను శాస్త్రసమ్మతముగా చూపుటకే కవి ప్రయోగించెను, గాని రసాభివ్యక్తికి మాత్రము కాదు

ఒకేకావ్యమున అనేకరసములు ప్రస్తుతము లైనచో, వానిలో నొకటే ప్రధానరసముగా ఉండవలెను. శృంగారాది రసము లున్నను, ఉత్తమోత్తమ మైన రసము శాంతము లోకోత్తరశక్తి గల మహాను భావుల చిత్తవృత్తివిశేష మగు శాంతమును రసముగా అంగీకరింపక తప్పదు.

వ్యంజకము లైన వాచ్యము లగు విభావాదులను వాచకము లగు శబ్దములను ఔచిత్యము దృష్టిలో నుంచుకొని రసాదివిషయమున యోజిం చుటయే మహాకవి పని కైశిక్యాదివృత్తులకు కూడ రసతాత్పర్యమునే ప్రపంచించిన కారికాకారుడు వృత్తికారు డగు ఆనందవర్ధనుడు రససిద్ధాం తమునే పోషించినారు రసప్రతీతి వ్యంజనావ్యాపారముద్వారా కలుగుచు న్న దని చెప్పుటయే వీరివాదమున గల ముఖ్యసిద్ధాంతము

రసము ఆత్మ ఇతివృత్తము శరీరము అను ఆనందవర్ధనుని వాదము భరతసమ్మతము. నాట్యశరీరము ఇతివృత్త మని భరతుడు నాట్యమనగా రసమే అని అభినవుడు

శబ్దమునకు వాచ్యార్థమును తెలుప గలశక్తి ఉన్నది దీనితోపాటు అర్థాంతరమును బోధపరచుశక్తి కూడ గలదు ఈ రెండువ్యాపారములకు భిన్నరూపములు, భిన్నవిషయములు ఉన్నవి స్వార్థవిషయ మగువాచ్యార్థము శబ్దసంబంధిగాను అర్థాంతరవిషయ మైన గమకత్వలక్షణము పైచెప్పిన శబ్దసంబంధితో సంబంధము గలదిగాను భాసించుచున్నది వాచ్యార్థమునకు సాక్షాత్సంబద్ధసంబంధ మున్నది రెండవది అభిధేయ సామర్థ్యాక్షిప్త మైనది అభిధానశక్తి వేరు అవగమనశక్తి వేరు అవగమక మగు వ్యంజితార్థము ప్రతీత మగునపుడు వాచ్యార్థము దూర మగుట లేదు. వాచ్యార్థావభాసకు వ్యంగ్యార్థావభాసకు అవినాభావ సంబంధ మున్నది. వ్యంగ్యార్థప్రతీతి ఉన్నపుడుకూడ వాచ్యార్థము నివర్తింపబడదు ఒక శబ్దమునే ఆశ్రయించుకొన్నది వాచ్యత్వము శబ్దార్థములను రెంటిని ఆశ్రయించుకొనియున్నది వ్యంజకత్వము. శబ్దముయొక్క ముఖ్య వ్యాపారముగానే ఈ వ్యంజకత్వము ప్రతీయమాన మగుచున్నది.

గౌణార్థముకూడ శబ్దమును అర్థమును ఆశ్రయించుకొని వచ్చునదే ఐనను దీనికంటె భిన్న మైనది వ్యంజకత్వము. గౌణవృత్తి శబ్దముయొక్క ముఖ్యవ్యాపారము కాదు. వ్యంజకత్వము ముఖ్య వ్యాపారముగానే భాసించుచున్నది అముఖ్యముగా నున్నది వాచకత్వమే కాగలదు పైగా గుణవృత్తిలో ఒకఅర్థము వేరొక అర్థమునకు ఉపలక్షణము వ్యంజకత్వమున ఒకఅర్థ మింకొక అర్థమును సూచించునపుడు స్వస్వరూపమును ప్రకాశింపజేయుచు వేరొకదానిని కూడ ప్రకాశింప జేయును

శబ్దవ్యవహారమున వాచకత్వము, గుణవృత్తి, వ్యంజకత్వము అను మూడు ప్రకారము లున్నవి వ్యంజకత్వమున వ్యంగ్యమే ప్రధాన మైనచో దానిని ధ్వని అందురు ఈ ధ్వని అవివక్షితవాచ్య మని వివక్షితాన్యపరవాచ్య మని రెండు విధములు

పురుషాభిప్రాయమే ఉచ్చరింపబడిన వాక్యముయొక్క అర్థమును నిర్ణయించునది ఈ అభిప్రాయము అభిధేయార్థము కాదు ఇది వ్యంగ్యార్థమే వక్తయొక్క అభిప్రాయప్రకాశనమే వ్యంజకత్వ మను సామర్థ్యము.

వ్యంగ్యార్థము వాచ్యసామర్థ్యముచే ఆక్షిప్త మైన దగుటవలన వాచ్యము నకువలె వ్యంగ్యమునకు కూడ శబ్దముతో సంబంధ మున్నది ఇది సాక్షాత్సంబంధము కావచ్చును, కాకపోవచ్చును వక్తయొక్క అభిప్రాయరూప మగు వ్యంగ్యవిషయమున శబ్దములు హేతువులుగా ప్రవర్తించుచున్నట్లు కొందరు భావించగలరు కాని అర్థము ప్రతీయమాన మగునపుడు శబ్దమునకు వాచకత్వవ్యాపారము గాక, వ్యంజకత్వవ్యాపారము కన్పించును ఈ వ్యంజకత్వమును హేతువుగా గ్రహింప వీలు లేదు కనుక హేతుప్రతీతియే వ్యంగ్యప్రతీతి అనుట అసంభవము

అన్నిఅలంకారములలోను అంతర్లీనముగా అతిశయోక్తి కలదు కావ్యశోభను ఇది పోషించునది అగుటచే కాళిదాసాది మహాకవులు దీనివి ప్రయోగించిరి విషయౌచిత్యమును దృష్టిలో ఉంచుకొని అతిశయోక్తిని ఉపయోగించినపుడు కావ్యమునకు ఉత్కర్ష రాకతప్పదు అలంకారము లన్నిటిలోను అతిశయోక్తి వ్యాప్యముగా ఉన్నదని భావము భామహుడు సైతము దీనినే వక్రోక్తి అని ఈ వక్రోక్తి లేనిదే అలంకారమునకు అలంకారత్వము రా దని చెప్పినాడు శబ్దవక్రత, అభిధేయవక్రత అని భామహు డనినపుడు అలౌకికరూపమున గల శబ్దార్థముల స్థితివి ప్రస్తుతించెను. లోకోత్తరత్వమే అతిశయము కనుక సర్వాలంకారసామాన్య మైనది అతిశయోక్తి అనినాడు అతిశయోక్తి వలన అర్థము విచిత్రముగా అనుభూత మగుచున్నది. అతిశయోక్తి ప్రస్ఫుటముగా గల అలంకారమున కవి ప్రతిభద్వారా అలౌకిక సౌందర్యము భాసించును ఇట్టి అతిశయోక్తికి వ్యంగ్యత్వమునకు భేదము కన్పింపదు

వ్యంజన గల కావ్యము అన్నిటికన్న గొప్పది తర్వాత వచ్చునది గుణీభూత వ్యంగ్యము కల కావ్యము. అధమ కావ్యమగు చిత్ర కావ్యము కావ్యానుకారమే అగును కావ్యనయ వ్యవస్థాపనకు ధ్వనికంటె భిన్న మైన కావ్య ప్రకారము లేదు రసౌచిత్య లక్షణ మైన శబ్దార్థ విషయము గల కవి రచన రసాది తాత్పర్య శూన్య మైనచో శోభింపదు కవి రస పూర్ణు డైనచో తన కిష్ట మగు రసమున వస్తు జాలమును పరిణమింప చేయగలడు కవి శృంగార రసపూర్ణు డైన కావ్య జగమునే రసమయము చేయగలడు కవి రాగరహితు డైన సమస్తము రసశూన్యము కాగలదు

అని పలికినాడు. రసపూర్ణు డగు కవి అచేతనములను చేతనములుగను, చేతనములను అచేతనములుగను స్వేచ్ఛగా ప్రదర్శింప గలడు. కావున రస పరత్వముగా తీసికొని పోవాలని వస్తు వనుర దేదియు లేదు మహాకవుల మహాకావ్యములలో ఈ విషయము ప్రస్ఫుటముగా కన్పించుచున్నది

రసము వ్యంజనా వ్యాపారమువలన ప్రతీత మగుచున్నది ఈ ధ్వనియే కవి ప్రతిభా గుణమునకు, అనంత్యమునకు కవి వాక్కుకు నవత్వ మును అపాదించునది బాహ్య జగమున మహాకావ్యములలోను మనకు కనిపించు విషయములు పరిచితములే ఐనను నూతన కావ్యమున రస ప్రాణితములై భాసింపగానే క్రొత్తవిగా అనుభూతము లగుచున్నవి కావున అపూర్వార్థ లాభమును కోరు కవి రసాదిమయ మగు కావ్యమున వ్యంగ్య వ్యంజక భావమును ప్రయత్న పూర్వకముగా సాధింపవలెను రామాయణ మహాభారతములలో సంగ్రామాదులు ఈ రీతిగా నిత్య నూత్నములై ప్రతీత మగుచున్నవి

రామాయణమున ఆదికవి కరుణ రసమును సమగ్రముగా పోషిం చెను మహాభారతమున మోక్షమను పురుషార్థమును సూచించు శాంత రసమే ప్రధానముగా పోషింప బడినది ఇది శాంత రసమును అంగిగా చూపిన గ్రంథ మని వ్యంగ్య రూపమున చెప్పబడినది

వ్యంగ్యార్థము ననుసరించియే గాక, వాచ్యార్థమును అనుసరించి నను అనంతములగు అర్థములు రాగలవు. దేశభేదము, కాలభేదము, అవస్థా భేదము అను కారణములద్వారా ఈ అనంత్యము, నవత్వము సిద్ధింప గలవు. కుమార సంభవమున మొదట పార్వతిని వర్ణించి, తర్వాత శివుని లోచన గోచర మగు సందర్భమున మరల వర్ణించుటయే గాక, వివాహ సమయమున గూడ పార్వతిని కవి వర్ణించెను వీనిలో ఏదియు వెనుకటి దానికి అనుకరణము కాదు ఇచట పునరుక్తి లేదు. ఇట్టి అనంత్యము, నవత్వము అనునవి కవి ప్రతిభవలన వచ్చున వగుటచే రసము నాశ్రయించు కొని యున్నవి రసభావాది సంబద్ధమై ఔచిత్యము ననుసరించి ఇవి రాగలవు కనుక వీనికి క్షయము అనునది లేదు. ఒక కావ్యమునకు ఇంకొక దానికి పోలిక లున్నంత మాత్రమున వీనిలో నొకదానిని తీసివేయ

రాదు కావ్యమున ప్రతిబింబమునంటి దగు కావ్యవస్తు వున్న దానిని వదలి వేయవలెను ఇంకొక దానిని పోలియున్నను పరిహరింపవలెను సామ్య మున్నను విభిన్నమై, సుందర మగు శరీరము కల్గియున్నచో అట్టి కావ్య వస్తువును గ్రహింపవలెను క్రొత్త అక్షరములను పదములను ఎట్లు సృష్టింపలేమో, అట్లే క్రొత్త కావ్య వస్తువుకూడ సృష్టింప లేము సహృదయులకు ఆస్వాద ప్రధాన మగు బుద్ధిని స్వల్పముగా నైనను ఒక కావ్య మీయగల్గినచో, అవి పూర్వకవుల జాడలో నున్నప్పటికిని, పూర్వుల నుండి కావ్య వస్తువును గ్రహించి నప్పటికిని స్వీకరింప దగినదే మహా కవుల మహా కవిత్వమున సరస్వతీ దేవియే అర్థమును ఆవిర్భవింప చేయునది.

ధ్వన్యాలోక కారికాః :

కావ్య స్యాత్మా ధ్వని రితి బుధై ర్యః సమామ్నాతపూర్వః
తస్యాభావం జగదు రపరే భాక్త మాహు స్త మన్యే
కేచి ద్వాచాం స్థిత మవిషయే తత్త్వ మూచు స్తదీయం
తేన బ్రూమః సహృదయ మనః ప్రీతయే తత్స్వరూపమ్ 1.1

యోఽర్థః సహృదయ శ్లాఘ్యః కావ్యాత్మేతి వ్యవస్థితః
వాచ్య ప్రతీయమానాఖ్యౌ తస్య భేదా వుభౌ స్మృతౌ. 1.2

తత్ర వాచ్యః ప్రసిద్ధో యః ప్రకారై రుపమాదిభిః
బహుధా వ్యాకృతః సోఽన్యైః తతో నేహ ప్రతన్యతే 1.3

ప్రతీయమానం పున రన్య దేవ వ స్త్వస్తి వాణీషు మహాకవీనామ్
య త్తత్ప్రసిద్ధావయ వాతిరి క్తం విభాతి లావణ్యమి వాంగనాసు 1.4

కావ్య స్యాత్మా స ఏ వార్థ స్తథా చాదికవేః పురా
క్రౌంచద్వంద్వ వియోగోత్థః శోకః శ్లోకత్వ మాగతః 1.5

సరస్వతీ స్వాదు తదర్థ వస్తు
నిఃష్యందమానా మహతాం కవీనామ్
అలోకసామాన్య మభివ్యనక్తి
పరిస్ఫురంతం ప్రతిభా విశేషమ్ 1.6

శబ్దార్థ శాసన జ్ఞానమాత్రే ణైవ న వేద్యతే
వేద్యతే స తు కావ్యార్థ తత్త్వజ్ఞై రేవ కేవలమ్. 1 7

సోఽర్థ స్తద్వ్యక్తి సామర్థ్యయోగీ శబ్దశ్చ కశ్చ న
యత్నతః ప్రత్యభిజ్ఞేయౌ తౌ శబ్దార్థౌ మహాకవేః. 1 8

ఆలోకార్థీ యథా దీపశిఖాయాం యత్నవాన్ జనః
తదుపాయతయా తద్వ దర్థే వాచ్యే త దాదృతః. 1.9

యథా పదార్థద్వారేణ వాక్యార్థః సంప్రతీయతే
వాచ్యార్థ పూర్వికా తద్వ త్ప్రతిప త్తస్య వస్తునః 1 10

స్వసామర్థ్యవశే నైవ వాక్యార్థం ప్రతిపాదయన్
యథా వ్యాపార నిష్పత్తౌ పదార్థో న విభావ్యతే. 1,11

తద్వ త్సచేతసాం సోఽ ర్థో వాచ్యార్థ విముఖాత్మనామ్
బుద్ధౌ తత్త్వార్థ దర్శిన్యాం ఝటి త్యేవావభాసతే 1 12

యత్రార్థః శబ్దో వా త మర్థ ముపసర్జనీకృత స్వార్థౌ
వ్యంక్తః కావ్య విశేషః స ధ్వని రితి సూరిభిః కథితః 1 13

భక్త్యా బిభ ర్తి నైకత్వం రూపభేదా దయం ధ్వనిః
అతివ్యాప్తే రథా వ్యాప్తే ర్నచాసౌ లక్ష్యతే తయా. 1.14

ఉక్త్యంతరే ణాశక్యం య త్తచ్చారుత్వం ప్రకాశయన్
శబ్దో వ్యంజకతాం బిభ్రద్ ధ్వన్యుక్తే ర్విషయీ భవేత్. 1 15

ముఖ్యాం వృత్తిం పరిత్యజ్య గుణవృ త్త్యార్థ దర్శనమ్
య దుద్దిశ్య ఫలం తత్ర శబ్దో నైవ స్ఖలద్గతిః 1.17

వాచక త్వాశ్రయే ణైవ గుణవృత్తి ర్వ్యవస్థితా
వ్యంజక త్వైకమూలస్య ధ్వనేః స్యా ల్లక్షణం కథమ్. 1.18

కస్యచిద్ ధ్వనిభేదస్య సా తు స్యా దుపలక్షణమ్
లక్షణేఽ న్యైః కృతే చాస్య పక్షసంసిద్ధి రేవ నః. 1.19

అర్థాంతరే సంక్రమిత మత్యంతం వా తిరస్కృతమ్
అవివక్షిత వాచ్యస్య ధ్వనే ర్వాచ్యం ద్విధా మతమ్ 2 1

అసంలక్ష్యక్రమోద్ద్యోతః క్రమేణ ద్యోతితః పరః
వివక్షితాభిధేయస్య ధ్వనే రాత్మా ద్విధా మతః. 2 2

రసభావతదాభాస తత్ప్రశాంత్యాది రక్రమః
ధ్వనే రాత్మాంగి భావేన భాసమానో వ్యవస్థితః. 2 3

వాచ్య వాచకచారుత్వ హేతునాం వివిధాత్మనామ్
రసాది పరతా యత్ర స ధ్వనే ర్విషయో మతః 2 4

ప్రధానేఽ న్యత్ర వాక్యార్థే య త్రాంగం తు రసాదయః
కావ్యే తస్మి న్నలంకారో రసాది రితి మే మతిః 2.5

శృంగార ఏవ మధురః పరః ప్రహ్లాదనో రసః
తన్మయం కావ్య మాశ్రిత్య మాధుర్యం ప్రతితిష్ఠతి 2 7

శృంగారే విప్రలంభాఖ్యే కరుణేచ ప్రకర్షవత్
మాధుర్య మార్ద్రతాం యాతి యత స్తత్రాధికం మనః 2 8

రసాక్షిప్తతయా యస్య బంధః శక్యక్రియో భవేత్
అపృథగ్యత్న నిర్వర్త్యః సోఽ లంకారో ధ్వనౌ మతః. 2 16

వ్యజ్యంతే వస్తుమాత్రేణ య దాలంకృతయ స్తయా
ధ్రువం ధ్వన్యంగతా తాసాం. కావ్య వృత్తి స్తదాశ్రయా. 2 29

అలంకారాంతరవ్యంగ్యభావే ధ్వన్యంగతా భవేత్
చారుత్వోత్కర్షతో వ్యంగ్య ప్రాధాన్యం యది లక్ష్యతే. 2 30

యత్ర ప్రతీయమానోఽర్థః ప్రమ్లిష్టత్వేన భాసతే
వాచ్య స్యాంగతయా వాపి నా స్యాసౌ గోచరో ధ్వనేః 2 31

అవ్యుత్పత్తే రశక్తే ర్వా నిబంధో యః స్ఖలద్గతేః
శబ్దస్య స చ న జ్ఞేయః సూరిభి ర్విషయో ధ్వనేః. 2 32

సర్వే ష్వేవ ప్రభేదేషు స్ఫుటత్వే నావభాసనమ్
యద్వ్యంగ్య స్యాంగిభూతస్య తత్పూర్ణం ధ్వని లక్షణమ్. 2.33

గుణా నాశ్రిత్య తిష్ఠంతీ మాధుర్యాదీన్ వ్యనక్తి సా (=సంఘటనా)
రసాన్ తన్నియమే హేతు రౌచిత్యం వక్తృవాచ్యయోః 3 6

ప్రసిద్ధేఽపి ప్రబంధానాం నానారస నిబంధనే
ఏకో రసో ఽంగీక ర్తవ్య స్తేషా ముత్కర్ష మిచ్ఛతా. 3 21

విజ్ఞా యేత్థం రసాదీనా మవిరోధ విరోధయోః
విషయం సుకవిః కావ్యం కుర్వన్ ముహ్యతి న క్వచిత్ 3 31

వాచ్యానాం వాచకానాం చ య దౌచిత్యేన యోజనమ్
రసాదివిషయే నైత త్కర్మ ముఖ్యం మహాకవేః 3 32

రసాద్యనుగుణత్వేన వ్యవహారోఽర్థశబ్దయోః
ఔచిత్యవాన్ య స్తా ఏతా వృత్తయో ద్వివిధాః స్థితాః 3 33

ప్రకారోఽన్యో గుణీభూతవ్యంగ్యః కావ్యస్య దృశ్యతే
యత్ర వ్యంగ్యాన్వయే వాచ్యచారుత్వం స్యాత్ ప్రకర్షవత్ 3.34

ప్రసన్నగంభీరపదాః కావ్యబంధాః సుఖావహాః
యే చ తేషు ప్రకారోఽయ మేవ యోజ్యః సుమేధసా. 3 35

ముఖ్యా మహాకవి గిరా మలంకృతిభృతా మపి
ప్రతీయమానచ్ఛా యైషా భూషా లజ్జేవ యోషితామ్ 3 37

ఇత్యుక్తలక్షణో యో ధ్వని ర్వివేచ్యః ప్రయత్నతః సద్భిః
సత్కావ్యం కర్తుం వా జ్ఞాతుం వా సమ్య గభియుక్తైః. 3 45

అస్ఫుటస్ఫురితం కావ్యతత్త్వ మేత ద్యథోదితమ్
అశక్నువద్భి ర్వ్యాకర్తుం రీతయః సంప్రవర్తితాః. 3 46

శబ్దతత్త్వాశ్రయాః కాశ్చి దర్థతత్త్వయుజోఽపరాః
వృత్తయోఽపి ప్రకాశంతే జ్ఞాతేఽస్మిన్ కావ్యలక్షణే. 3 47

ధ్వనే ర్యః స గుణీభూతవ్యంగ్య స్యాధ్వా ప్రదర్శితః
అనే నానంత్య మాయాతి కవీనాం ప్రతిభాగుణః 4 1

అతో హ్యన్యతమే నాపి ప్రకా రేణ విభూషితా
వాణీ నవత్వ మాయాతి పూర్వార్థాన్వయవ త్యపి 4 2

యుక్త్యా౽ నయానుస ర్తవ్యో రసాది ర్బహువిస్తరః
మితో౽ ప్యనంతతాం ప్రాప్తః కావ్యమార్గో య దాశ్రయాత్ 4 3

దృష్టపూర్వా అపి హ్యర్థాః కావ్యే రసపరిగ్రహాత్
స ర్వే నవా ఇవా భాంతి మధుమాస ఇవ ద్రుమాః 4.4

వ్యంగ్యవ్యంజకభా వే౽ స్మిన్ వివిధే సంభవ త్యపి
రసాదిమయ ఏకస్మిన్ కవిః స్యా దవధానవాన్ 4 5

అవస్థా దేశకాలాదివిశేషై రపి జాయతే
అనంత్య మేవ వాచ్యస్య శుద్ధ స్యాపి స్వభావతః 4 7

అవస్థాదివిభిన్నానాం వాచ్యానాం వినిబంధనమ్
భూమ్నైవ దృశ్యతే లక్ష్యే, తత్తు భాతి రసాశ్రయాత్ 4 8

రసభావాదిసంబద్ధా య ద్యౌచిత్యానుసారిణీ
అన్వీయతే వస్తుగతి ర్దేశకాలాదిభేదినీ ·4 9

వాచస్పతిసహస్రాణాం సహస్రై రపి యత్నతః
నిబద్ధా సా క్షయం నైతి ప్రకృతి ర్జగతా మివ 4 10

సంవాదాస్తు భవం త్యేవ బాహుల్యేన సుమేధసామ్
నైకరూపతయా సర్వే తే మంతవ్యా విపశ్చితా 4.11

సంవాదో హ్యన్యసాదృశ్యం త త్పునః ప్రతిబింబవత్
ఆలేఖ్యాకారవ త్తుల్యదేహవచ్చ శరీరిణామ్ 4 12

అక్షరాదిరచనేవ యోజ్యతే
యత్ర వస్తురచనా పురాతనీ

నూతనే స్ఫురతి కావ్యవస్తుని
వ్య క్త మేవ ఖలు సా న దుష్యతి 4 15

య దపి త దపి రమ్యం యత్ర లోకస్య కించిత్
స్ఫురిత మిద మితీయం బుద్ధి రభ్యుజ్జిహీతే
అనుగత మపి పూర్వచ్ఛాయయా వస్తు తాదృక్
సుకవి రుపనిబధ్న న్నింద్యతాం నోపయాతి 4 16

ప్రతీయంతాం వాచో నిమితవివిధార్థామృతరసా
న సా దః కర్తవ్యః కవిభి రనవద్యే స్వవిషయే
పరస్వాదానేచ్ఛా విరతమనసో వస్తు సుకవేః
సరస్వ త్యైవేషా ఘటయతి యథేష్టం భగవతీ 4 17

## ధ్వన్యాలోక వృత్తిః

కి మిదం సహృదయత్వం నామ ? కిం రసభావాన పేక్ష కావ్యాశ్రిత సమయవిశేషాభిజ్ఞత్వమ్ ? ఉత రస భావాదిమయ కావ్యస్వరూప పరిజ్ఞాన నైపుణ్యమ్ ? పూర్వస్మిన్ పక్షే తథావిధ సహృదయ వ్యవస్థాపితానాం శబ్దవిశేషాణాం చారుత్వనియమో న స్యాత్ పునః సమయాంతరే ణాన్యథాపి వ్యవస్థాపనసంభవాత్ ద్వితీయస్మిం స్తు పక్షే రసజ్ఞ తైవ సహృదయత్వ మితి (359)

తస్య హి ధ్వనేః స్వరూపం సకలసత్కవి కావ్యోపనిషద్భూత మతిరమణీయ మణీయసీభి రపి చిరంతనకావ్యలక్షణవిధాయినాం బుద్ధిభి రనున్మీలితపూర్వం అథ చ రామాయణ మహాభారత ప్రభృతిని లక్ష్యే సర్వత్ర ప్రసిద్ధవ్యవహారం లక్షయతాం సహృదయానా మానందో మనసి లభతాం ప్రతిష్ఠా మితి ప్రకాశ్యతే (పు. 35-38)

వ్యంగ్యో ఽ ర్థ స్తద్వ్యక్తిసామర్థ్యయోగే శబ్దశ్చ కశ్చ న ,
న శబ్దమాత్రమ్ తా వేవ శబ్దార్థే మహాకవేః ప్రత్యభిజ్ఞేయా.
వ్యంగ్యవ్యంజకాభ్యా మేవ సుప్రయుక్తాభ్యాం మహాకవిత్వలాభో మహా కవీనాం న వాచ్యవాచకరచనామాత్రేణ (97-98)

యత్రార్థో వాచ్యవిశేషః శబ్దో వా తమర్థం వ్యంక్తః, సకావ్య విశేషో ధ్వని రితి అనేన వాచ్యవాచక చారుత్వహేతుభ్య ఉపమాదిభ్యోఽనుప్రాసాదిభ్యశ్చ విభక్త ఏవ ధ్వనే ర్విషయ ఇతి దర్శితమ్ (104-106)

తత్పరా వేవ శబ్దార్థౌ యత్ర వ్యంగ్యం ప్రతిస్థితౌ
ధ్వనేః స ఏవ విషయో మంతవ్యః సంకరోజ్ఝితః (పు 13)

కావ్యవిశేషోఽంగీ ధ్వని రితి కథితః తస్య పున రంగాని అలంకారా, గుణా వృత్తయ శ్చేతి ప్రతిపాదయిష్యంతే న చావయవ ఏవ పృథగ్భూతోఽవయ వీతి ప్రసిద్ధః (131)

ప్రథమే హి విద్వాంసో వైయాకరణాః, వ్యాకరణమూలత్వాత్సర్వవిద్యానామ్ తే చ శ్రూయమాణేషు వర్ణేషు ధ్వని రితి వ్యవహరంతి తథై వాన్యై స్తన్మతానుసారిభిః సూరిభిః కావ్యతత్త్వార్థదర్శిభిః వాచ్యవాచకసంమిశ్రః శబ్దాత్మా కావ్య మితి వ్యపదేశ్యో వ్యంజకత్వసామ్యాత్ ధ్వని రి త్యుక్తః (132-135)

అస్తి ధ్వనిః స చా సా వవివక్షితవాచ్యో వివక్షితాన్య పరవాచ్య శ్చేతి ద్వివిధః సామాన్యేన. (136-7)

అలంకారో హి చారుత్వహేతుః ప్రసిద్ధః, న త్వసా వాత్మైవాత్మన శ్చారుత్వహేతుః (పు. 197)

యః పున రంగీ రసో భావో వా సర్వాకార మలంకార్యః స ధ్వనే రా త్మేతి (పు 204)

అనౌచిత్యా దృతే నాన్య ద్రసభంగస్య కారణమ్
ప్రసిద్ధౌచిత్య బంధ స్తు రసస్యోపనిష త్పరా (పు 330)

కవినా కావ్య ముపనిబధ్నతా సర్వాత్మనా రసపరతంత్రేణ భవితవ్యమ్ తత్రేతివృత్తే యది రసాననుగుణాం స్థితిం పశ్యే త్త దేమాం

భంక్త్వాపి స్వతంత్రతయా రసానుగుణం కథాంతర ముత్పాదయేత్. న హి కవే రితి వృత్త మాత్ర నిర్వహణేన కించిత్ప్రయోజనం, ఇతిహాసా దేవ తత్సిద్ధేః. (336)

రసాదివ్యంజకత్వే ప్రబంధస్య చేద మన్యన్ముఖ్యం నిబంధనం యత్సంధీనాం ముఖ ప్రతిముఖ గర్భావమర్శ నిర్వహణాఖ్యానాం తదంగానాం చోపక్షేపాదీనాం ఘటనం రసాభి వ్యక్త్యపేక్షయా, యథా రత్నావల్యాం న తు కేవలం శాస్త్రస్థితి సంపాదనేచ్ఛయా (336-340)

ఇతి వృత్తమాత్ర వర్ణన ప్రాధాన్యేఽంగాంగిభావ రహిత రసభావ నిబంధేన చ కవీనా మేవం విధాని స్ఖలితాని భవం తీతి రసాదిరూప వ్యంగ్య తాత్పర్య మేవైషాం యుక్త మితి యత్నోఽస్మాభి రారబ్ధో, న ధ్వని ప్రతిపాదన మాత్రాభినివేశేన (363-4)

శాంత శ్చ తృష్ణాక్షయ సుఖస్య యః పరిపోషః తల్లక్షణో రసః ప్రతీయత ఏవ యది నామ సర్వజనానుభవగోచరతా తస్య నాస్తి, నై తావతా సావలోక సామాన్య మహానుభావ చిత్త వృత్తి విశేషః ప్రతిక్షేప్తుం శక్యః (390-3)

అయ మేవ హి మహాకవే ర్ముఖ్యో వ్యాపారః, యద్రసాదీ నేవ ముఖ్యతయా కావ్యార్థీకృత్య తద్వ్యక్త్యనుగుణత్వేన శబ్దానా మర్థానాం చోప నిబంధనమ్ (401)

యత్ర శబ్దః స్వార్థ మభిదధానః అర్థాంతర మవగమయతి తత్ర య త్తస్య స్వార్థాభిధాయిత్వం య చ్చ తదర్థాంతరావగమ హేతుత్వం, తయో రవిశేషో విశేషో వా ? న తావ దవిశేషః యస్మాత్తౌ ద్వౌ వ్యాపారౌ భిన్న విషయౌ భిన్న రూపౌ చ ప్రతీయేతే ఏవ తథా హి వాచకత్వ లక్షణో వ్యాపారః శబ్దస్య స్వార్థవిషయః గమకత్వ లక్షణ స్త్వర్థాంతర విషయః తతః స్వపరవ్యవహారో వాచ్యగమ్యయో రపహ్నోతుం అశక్యః ఏకస్య సంబంధిత్వేన ప్రతీతే రపరస్య సంబంధి సంబంధిత్వేన న వాచ్యో హ్యర్థః సాక్షాచ్ఛబ్దస్య సంబంధీ తదితర స్త్వభిధేయ సామర్థ్యా

వృత్తేః సంబంధి సంబంధీ యది చ స్వసంబంధిత్వం సాక్షాత్తస్య స్యాత్త దార్థాంతరత్వ వ్యవహార ఏవ న స్యాత్ తస్మా ద్విషయభేద స్తావ త్తయో ర్వ్యాపారయోః సుప్రసిద్ధః రూపభేదోఽపి ప్రసిద్ధ ఏవ న హి సైవా భిధానశక్తిః సైవావగమన శక్తిః అవాచకస్యాపి గీతశబ్దాదే రసాది లక్షణార్థావగమ దర్శనాత్. అశబ్దస్యాపి చేష్టాదే రర్థవిశేష ప్రకాశన ప్రసిద్ధేః తథా హి- 'వ్రీడాయోగా న్నతవదనయా' ఇత్యాదిశ్లోకే చేష్టా విశేషః సుకవి నార్థప్రకాశన హేతుః ప్రదర్శిత ఏవ తస్మా ద్భిన్నవిష యత్వా ద్భిన్న రూపత్వాచ్చ స్వార్థాభిధాయిత్వ మర్థాంతరావగమహేతు త్వం చ శబ్దస్య య త్తయోః స్పష్ట ఏవ భేదః విశేష శ్చేత్ న త ర్హీదానీ మవగమనీయ స్యాభిధేయ సామర్థ్యాక్షిప్త స్యార్థాంతరస్య వాచ్యత్వవ్యపదేశ్యతా శబ్దవ్యాపార గోచరత్వం తు తస్యా స్మాభి రిష్యత ఏవ తత్తు వ్యంగ్యత్వే నైవ న వాచ్యత్వేన ప్రసిద్ధాభిధానాం తర సంబంధ యోగ్యత్వేన చ తస్యార్థాంతరస్య చ ప్రతీతేః శబ్దాంతరేణ స్వార్థాభిధాయినా య ద్విషయీకరణం తత్ర ప్రకాశనోక్తి రేవ యుక్తా (416-9)

న హి వ్యంగ్యే ప్రతీయమానే వాచ్యబుద్ధిః దూరీభవతి వాచ్యావ భాసా వినా భావేన తస్య ప్రకాశనాత్ తస్మా ద్ఘటప్రదీపన్యాయ స్తయోః. యథైవ హి ప్రదీపద్వారేణ ఘటప్రతీతా వుత్పన్నాయాం న ప్రదీప ప్రకాశో నివర్తతే తద్వ ద్వ్యంగ్యప్రతీతౌ వాచ్యావభాసః (420-421)

కిం చ వ్యంగ్యస్య ప్రాధాన్యే నావివక్షాయాం వాచ్యత్వం తావ ద్భవద్భి ర్నాభ్యుపగంతవ్యం అతత్పరత్వా చ్ఛబ్దస్య త దస్తి తావ ద్వ్యంగ్యః శబ్దానాం కశ్చి ద్విషయ ఇతి య త్రాపి తస్య ప్రాధాన్యం తత్రాపి కి మితి తస్య స్వరూప మపహ్నూయతే ఏవం తావ ద్వాచ కత్వా దన్యదేవ వ్యంజకత్వమ్ ఇతశ్చ వాచకత్వా ద్వ్యంజకత్వ స్యాన్య త్వం. య ద్వాచకత్వం శబ్దైకాశ్రయ మితర త్తు శబ్దాశ్రయ మర్థా శ్రయం చ (422-8)

గుణవృత్తిస్తూపచారేణ లక్షణయా చోభయాశ్రయాపి భవతి. కిం తు తతోఽపి వ్యంజకత్వం స్వరూపతో విషయతశ్చ భిద్యతే రూప భేద స్తావ దయం— య దముఖ్యతయా వ్యాపారో గుణవృత్తిః ప్రసిద్ధా వ్యంజకత్వం తు ముఖ్యత యైవ శబ్దస్య వ్యాపారః. న హ్యర్థా ద్వ్యంగ్య త్రయ ప్రతీతి ర్యా తస్యా అముఖ్యత్వం మనా గపి లక్ష్యతే అయం చాన్యః స్వరూపభేదః —య ద్గుణవృత్తి రముఖ్యత్వేన వ్యవస్థితం వాచకత్వమే వోచ్యతే వ్యంజకత్వం తు వాచకత్వా దత్యంతం విభిన్న మేవ ఏత చ్చ ప్రతిపాదితమ్ అయం చాపరో రూపభేదో యద్గుణవృత్తౌ య దార్థోఽర్థాంతర ముపలక్షయతి. త దోపలక్షణీయార్థాత్మనా పరిణత ఏ వాసౌ సంపద్యతే యథా గంగాయాం ఘోషః' ఇత్యాదౌ వ్యంజకత్వ మార్గే తు య దార్థోఽర్థాంతరం ద్యోతయతి తదా స్వరూపం ప్రకాశయ న్నే వాసౌ వన్యస్య ప్రకాశకః ప్రతీయతే ప్రదీపవత్ యథా 'లీలాకమల పత్రాణి గణయామాస పార్వతీ' ఇత్యాదౌ. యది చ య త్రాతిరస్కృత స్వప్రతీతి రర్థో ఽర్థాంతరం లక్షయతి తత్ర లక్షణావ్యవహారః క్రియతే త దేవం సతి లక్షణైవ ముఖ్యః శబ్దవ్యాపార ఇతి ప్రాప్తం యస్మా త్ప్రాయేణ వాక్యానాం వాచ్యవ్యతిరిక్త తాత్పర్య విషయార్థావభాసిత్వమ్. (423-4)

త దేవం శాబ్దే వ్యవహారే త్రయః ప్రకారాః —వాచకత్వం, గుణవృత్తిః వ్యంజకత్వం చ ' తత్ర వ్యంజకత్వే యదా వ్యంగ్య ప్రాధాన్యం తదా ధ్వనిః తస్య చ అవివక్షిత వాచ్యః వివక్షితాన్య పరవాచ్య శ్చేతి ద్వౌ ప్రభేదా వన క్రాంతౌ. (429)

స్వరూపం ప్రకాశయ న్నేవ పరావభాసకో వ్యంజక ఇ త్యుచ్యతే (431)

వ్యంజకత్వం చ యథోక్త చారుత్వ హేతుం వ్యంగ్యం వినా న వ్యవతిష్ఠతే. (432-3)

శబ్దార్థయో ర్హి ప్రసిద్ధో యః సంబంధః వాచ్య వాచక భావాఖ్యః త మనురుంధాన ఏవ వ్యంజకత్వ లక్షణో వ్యాపారః సామగ్ర్యంతర సంబంధా దౌపాధికః ప్రవర్తతే అత ఏవ వాచకత్వా త్తస్య విశేషః.

వాచకత్వం హి శబ్ద విశేషస్య నియత ఆత్మా వ్యుత్పత్తి కాలా దారభ్య తదవినాభావేన తస్య ప్రసిద్ధత్వాత్ స త్వనియతః ఔపాధికత్వాత్ ప్రకరణా ద్యవచ్ఛేదేన తస్య ప్రతీతేః ఇతరథా త్వప్రతీతేః (436-7)

వ్యంగ్య ప్రకాశనం హి వ్యంజకత్వమ్ పౌరుషేయాణి చ వాక్యాని ప్రాధాన్యేన పురుషాభిప్రాయ మేవ ప్రకాశయంతి న చ వ్యంగ్య ఏవ న త్వభిధేయః, తేన సహాభిధానస్య వాచ్య వాచక భావ లక్షణ సంబంధాభావాత్ (440-1)

య త్త్వభిప్రాయ విశేష రూపం వ్యంగ్యం శబ్దార్థాభ్యాం ప్రకాశతే త ద్భవతి వివక్షితం తాత్పర్యేణ ప్రకాశ్యమానం సత్ కింతు త దేవ కేవల మపరిమిత విషయస్య ధ్వని వ్యవహారస్య న ప్రయోజకం అవ్యాపకత్వాత్ తథా దర్శిత భేదత్రయ రూపం తాత్పర్యేణ ద్యోత్య మాన మభిప్రాయరూప మనభిప్రాయరూపం చ సర్వ మేవ ధ్వని వ్యవహా రస్య ప్రయోజక మితి యథోక్త వ్యంజకత్వ విశేషే ధ్వని లక్షణే నాతి వ్యాప్తిః న చావ్యాప్తిః తస్మా ద్వాక్య తత్త్వవిదాం మతేన తావద్ వ్యంజకత్వ లక్షణః శాబ్దో వ్యాపారో న విరోధీ ప్రత్యు తానుగుణ ఏవ లక్ష్యతే. పరినిశ్చిత నిరపభ్రంశ శబ్ద బ్రహ్మణాం విపశ్చితాం మత మాశ్రి త్యైవ ప్రవృత్తోఽ యం ధ్వని వ్యవహార ఇతి తైః సహ కిం విరోధా విరోధౌ చింత్యేతే కృత్రిమ శబ్దార్థ సంబంధ వాదినాం తు యుక్తివిదా మనుభవసిద్ధ ఏ వాయం వ్యంజక భావః శబ్దానా మర్థాంతరాణా మి వావిరోధ శ్చేతి న ప్రతిక్షేప్య పదవీ మవతరతి. (443-6)

వ్యంగ్య శ్చార్థో వాచ్యసామర్థ్యాక్షిప్తతయా వాచ్యవ చ్ఛబ్దస్య సంబంధీ భవ త్యేవ సాక్షా దసాక్షాద్భావో హి సంబంధస్య అప్రయోజకః వాచ్యవాచక భావాశ్రయత్వం చ వ్యంజకత్వస్య ప్రా గేవ దర్శితమ్ తస్మా ద్వక్త్రభిప్రాయరూప ఏవ వ్యంగ్యే లింగతయా శబ్దానాం వ్యాపా రః తద్విషయీకృతే తు ప్రతిపాద్యతయా ప్రతీయమానే తస్మి న్నభి ప్రాయరూపే ఽనభిప్రాయరూపే చ వాచకత్వే నైవ వ్యాపారః సంబం ధాంతరేణ వా? న తావ ద్వాచకత్వేన, య థోక్తం ప్రాక్ సంబం ధాంతరేణ వ్యంజకత్వ మేవ. న చ వ్యంజకత్వం లింగత్వరూప మేవ

ఆలోకాది ష్వన్యథా దృష్టత్వాత్. తస్మాత్ ప్రతిపాద్యో విషయః శబ్దానాం న లింగిత్వేన సంబంధీ వాచ్యవత్ (452-)

యత్త్వనుమేయరూప వ్యంగ్య విషయం శబ్దానాం వ్యంజకత్వం, తద్ధ్వని వ్యవహారస్యాప్రయోజకమ్. అపి తు వ్యంజకత్వ లక్షణః శబ్దానాం వ్యాపార ఔత్పత్తిక శబ్దార్థ సంబంధవాదినా ప్యభ్యుపగంతవ్య ఇతి ప్రదర్శనార్థ ముపన్యస్తమ్ తద్ధి వ్యంజకత్వం కదాచి ల్లింగత్వేన, కదాచి ద్రూపాంతరేణ శబ్దానాం వాచకానా మవాచకానాం చ సర్వవాదిభి రప్రతిక్షేప్య మి త్యయ మస్మాభి ర్యత్న ఆరబ్ధః త దేవం గుణవృత్తి వాచకత్వాదిభ్యః శబ్ద ప్రకారేభ్యో నియమే నైవ తావ ద్విలక్షణం వ్యంజకత్వమ్ (455-6)

ప్రథమం తావ దతిశయోక్తిగర్భతా సర్వాలంకారేషు శక్యక్రియా కృతైవ చ సా మహాకవిభిః కామపి కావ్యచ్ఛవిం పుష్యతి కథం హ్యతిశయయోగితా స్వవిషయౌచిత్యేన క్రియమాణా సతీ కావ్యే నోత్కర్ష మావహేత్ భామహేనా ప్యతిశయోక్తిలక్షణే య దుక్తం-

సైషా సర్వైవ వక్రోక్తి రనయార్థో విభావ్యతే
యత్నోఽస్యాం కవినా కార్యః కోఽలంకారోఽనయా వినా

ఇతి తత్రాతిశయోక్తి ర్య మలంకార మధితిష్ఠతి కవిప్రతిభావశా త్తస్య చారుత్వాతిశయయోగోఽన్యస్య త్వలంకారమాత్రతైవేతి సర్వాలంకారశరీర స్వీకరణయోగ్యత్వే నాభేదోపచారా త్సైవ సర్వాలంకారరూపే త్యయమే వార్థోఽవగంతవ్యః. (465 - 468)

వ్యంగ్య స్యార్థస్య ప్రాధాన్యే ధ్వనిసంజ్ఞితకావ్య ప్రకారః గుణభావే తు గుణీభూతవ్యంగ్యతా. తతోఽన్య ద్రసభావాదితాత్పర్య రహితం వ్యంగ్యార్థ విశేషప్రకాశనశక్తిశూన్యం చ కావ్యం కేవలవాచ్య వాచక వైచిత్ర్యమాత్రాశ్రయే ణోపనిబద్ధ మాలేఖ్య ప్రఖ్యం యదాభాసతే తచ్చిత్రమ్ న త న్ముఖ్యం కావ్యమ్ కావ్యానుకారో హ్యసౌ (495)

ఇదానీంతనానాం తు న్యాయ్యే కావ్యనయవ్యవస్థాపనే క్రియమాణే నా స్త్యేవ ధ్వనివ్యతిరిక్తః కావ్యప్రకారః యతః పరిపాకవతాం కవీనాం రసాదితాత్పర్యవిరహే వ్యాపార ఏవ న శోభతే. రసాదితాత్పర్యే చ నా స్త్యేవ తద్వస్తు య దభిమత రసాంగతాం నీయమానం న ప్రగుణీభవతి అచేతనా అపి హి భావా యథాయథ ముచిత రసవిభావతయా చేతనవృత్తాంత యోజనయా వా న సంత్యేవ తే యే యాంతి న రసాంగతామ్ తథా చేద ముచ్యతే—

అపారే కావ్యసంసారే కవి రేకః ప్రజాపతిః
య థాస్మై రోచతే విశ్వం త థేదం పరివర్తతే
శృంగారీ చే త్కవిః కావ్యే జాతం రసమయం జగత్
స ఏవ వీతరాగ శ్చే న్నీరసం సర్వ మేవ తత్
భావా నచేతనా నపి చేతనవ చ్చేతనా నచేతనవత్
వ్యవహారయతి యథేష్టం సుకవిః కావ్యే స్వతంత్రతయా.

తస్మాన్నాస్త్యేవ తద్వస్తు య త్సర్వాత్మనా రసతాత్పర్యవతః కవే స్తదిచ్ఛయా తదభిమతరసాంగతాం న ధత్తే త థోపనిబధ్యమానం వా న చారుత్వాతిశయం పుష్ణాతి సర్వ మేత చ్చ మహాకవీనాం కావ్యేషు దృశ్యతే ( 497 - 9 )

యస్మిన్ రసో వా భావో వా తాత్పర్యేణ ప్రకాశతే
సంవృ త్త్యాభిహితో వస్తు య త్రాలంకార ఏవ వా
కావ్యాధ్వని ధ్వని ర్వ్యంగ్యప్రాధాన్యైకనిబంధనః
సర్వత్ర తత్ర విషయీ జ్ఞేయః సహృదయై ర్జనైః (500-1)

అనాఖ్యేయాంశభాసిత్వం నిర్వాచ్యార్థతయా ధ్వనేః
న లక్షణం, లక్షణం తు సాధీయో౽ స్య యథోదితమ్ ( 520 )

రామాయణే హి కరుణో రసః స్వయ మాదికవినా సూత్రితః 'శోకః శ్లోకత్వ మాగతః' ఇ త్యేవంవాదినా. నిర్వ్యూఢశ్చ స ఏవ సీతాత్యంత వియోగపర్యంత మేవ స్వప్రబంధ ముపరచయతా మహాభారతే ౽పి శాస్త్రరూపే కావ్యచ్ఛాయాన్వయిని వృష్ణిపాండవవిరసావ

సాన వైమనస్యదాయినీం సమాప్తి ముపనిబధ్నతా మహామునినా వైరాగ్యజనన తాత్పర్యం ప్రాధాన్యేన స్వప్రబంధస్య దర్శయతా మోక్షలక్షణః పురుషార్థః శాంతో రస శ్చ ముఖ్యతయా వివక్షావిషయత్వేన సూచితః తత శ్చ శాంతో రసో రసాంతరైః మోక్షలక్షణః పురుషార్థః పురుషార్థాంతరై స్తదుపసర్జనత్వే నానుగమ్యమానోఽంగిత్వేన వివక్షావిషయ ఇతి మహాభారతతాత్పర్యం సువ్యక్త మేవావభాసతే (529 - 531)

శాంత స్యైవ రస స్యాంగిత్వం మహాభారతే, మోక్షస్య చ సర్వపురుషార్థేభ్యః ప్రాధాన్య మి త్యేత న్న స్వశబ్దాభిధేయత్వే నానుక్రమణ్యాం దర్శితమ్ దర్శితం తు వ్యంగ్యత్వేన-

భగవాన్ వాసుదేవ శ్చ కీర్త్యతే ఽత్ర సనాతనః

ఇత్యస్మిన్ వాక్యే అనేన హ్యయ మర్థో వ్యంగ్యత్వేన వివక్షితో య దత్ర మహాభారతే పాండవాదిచరితం యత్ కీర్త్యతే తత్సర్వ మవసానవిరస మవిద్యాప్రపంచరూపం చ పరమార్థసత్యస్వరూప స్తు భగవాన్ వాసుదేవో ఽత్ర కీర్త్యతే తస్మా త్తస్మిన్నేవ పరమేశ్వరే భగవతి భవత భావితచేతసో మా భూత విభూతిషు నిఃసారాసు రాగిణో గుణేషు వా నయవినయ పరాక్రమాది ష్వమీషు కేవలేషు కేషుచి త్సర్వాత్మనా ప్రతినివిష్టధియః తథా చాగ్రే- పశ్యత నిఃసారతాం సంసారస్య ఇత్యము మేవార్థం ద్యోతయన్ స్ఫుట మే వావభాసతే వ్యంజకశక్త్యనుగ్రహీత శ్చ శబ్దః ఏవంవిధ మే వార్థం గర్భీకృతం సందర్శయతో ఽనంతరశ్లోకా లక్ష్యంతే- స హి సత్యం ఇత్యాదయః

అయం చ నిగూఢరమణీ యోఽర్థో మహాభారతావసానే హరివంశవర్ణనేన సమాప్తిం విదధతా తేనైవ కవివేధసా కృష్ణద్వైపాయనేన సమ్యక్ స్ఫుటీకృతః అనేన చార్థేన సంసారాతీతే తత్త్వాంతరే భక్త్యతిశయం ప్రవర్తయతా సకల ఏవ సాంసారికో వ్యవహారః పూర్వపక్షీకృతో న్యక్షేణ ప్రకాశతే. దేవతాతీర్థ తపః ప్రభృతీనాం చ ప్రభావాతిశయవర్ణనం తస్యైవ పరబ్రహ్మణః ప్రాప్త్యుపాయిత్వేన తద్విభూతిత్వేనైవ దేవతా విశేషాణా మన్యేషాం చ పాండవాది చరిత వర్ణన స్యాపి

వైరాగ్యజనన తాత్పర్యా ద్వైరాగ్యస్య చ మోక్షమూలత్వా న్మోక్షస్య చ భగవత్ప్రాప్త్యుపాయత్వేన ముఖ్యతయా గీతాదిషు ప్రదర్శితత్వా త్పరబ్రహ్మప్రాప్త్యుపాయత్వ మేవ

త దేవ మనుక్రమణీ నిర్దిష్టే న వాక్యేన భగవద్వ్యతిరేకిణః సర్వస్యాన్య స్యానిత్యతాం ప్రకాశయతా మోక్షలక్షణ ఏ వైకః పరః పురుషార్థః శాస్త్రనయే కావ్యనయే చ తృష్ణాక్షయ సుఖపరిపోషలక్షణః శాంతో రసో మహాభారత స్యాంగిత్వేన వివక్షిత ఇతి సుప్రతిపాదితమ్ అత్యంతసారభూతత్వా చ్చాయ మర్థో వ్యంగ్యత్వే నైవ దర్శితో న తు వాచ్యత్వేన . ప్రసిద్ధి శ్చేయ మ స్త్యేవ విదగ్ధవిద్వత్పరిషత్సు యదభిమతతరం వస్తు వ్యంగ్యత్వేన ప్రకాశ్యతే న సాక్షాచ్ఛబ్దవాచ్యత్వేన
(581 - 588)

యేషాం సుకవీనాం ప్రాక్తన పుణ్యాభ్యాస పరిపాకవశేన ప్రవృత్తిః తేషాం పరోపరచితార్థ పరిగ్రహనిఃస్పృహాణాం స్వవ్యాపారో న క్వచి దుపయుజ్యతే సైవ భగవతీ సరస్వతీ స్వయ మభిమత మర్థ మావిర్భావయతి ఏత దేవ హి మహాకవిత్వం మహాకవీనా మి త్యోమ్.
(551)



# ము కు ల భ ట్టు

అవంతివర్మ (855-883) కాశ్మీరమును పరిపాలించుచున్నప్పుడు భట్ట కల్లటుని పుత్రుడు ముకులు డుండెను. ప్రతీహారేందురాజుగురు వగు ముకులభట్టు రచించిన అభిధావృత్తిమాతృక లో శబ్దమునకు ముఖ్యార్థము లాక్షణికార్థము గల వని వివరింపబడినది ఇక్కడ ప్రతిపాదింపబడిన లక్షణా వ్యాపారమునే తర్వాతి ఆలంకారికు లందరు గ్రహించినారు.

ఒకశబ్దమునకు భిన్నము లగు అర్థములు ఉండవచ్చును వీనిలో ముందుగా ఏ అర్థము స్ఫురించునో అది ముఖ్యార్థాము. ఈ అర్థము ద్వారా ప్రతీత మగు తర్వాతి అర్థమును లక్షణ అందురు. అవు అను పదమును వినగనే ఆ జంతువు ఆకృతి మొద లగునవి బోధపడుచున్నవి. కనుక ఈ జాత్యర్థము ముఖ్యార్థము. విశిష్ట మైన అవును తెలియపరచి నవుడు అవ్యక్తినిష్ఠ మైన అర్థము లాక్షణికార్థము ముఖ్యార్థము నాలుగు విధములు జాతిని గుణమును క్రియను తెలుపుశబ్దములతో పాటు యదృచ్ఛాశబ్దములు కూడ కల వని మహాభాష్యకారు డనినాడు. లాక్షణికార్థము శుద్ధ మని ఔపచారిక మని రెండు విధములు శుద్ధలక్షణలో అర్థాంతరోపాదానము అర్థాంతరలక్షణ అనునవి కలవు కనుక ఇవి రెండు రకములు ఔపచారికమున నాలుగు భేదములు రాగలవు ఈ రీతిగా ముకులుడు నాలుగువిధముల ముఖ్యార్థమును ఆరురకముల లక్షణను నిర్వచించెను. ఈ పదివిధముల అభిధావ్యాపారమును తెలిసికొని దీనిని సాహిత్యాది శాస్త్రములలో సరిగా ప్రయోగించువాడు వాగీశ్వరుడు కాగల డని పల్కినాడు శబ్దమునకు గల ముఖ్యశక్తి అభిధావ్యాపార మొక్కటే అర్థమునకు గల శక్తి లక్షణ ఈ లక్షణలో ధ్వని అంతర్భావము

## అ భి ధా వృ త్తి మా తృ క

శబ్ద వ్యాపారతో యస్య ప్రతీతి స్తస్య ముఖ్యతా
అర్థావసే యస్య పునర్లక్ష్యమాణస్య ముచ్యతే

యస్య తు శబ్దవ్యాపా రావగమ్యమా నార్థపర్యాలోచనయా అవగతిః తస్య లాక్షణికత్వమ్ (పు. 8)

పదవాక్యప్రమాణేషు త దేతత్ప్రతిబింబితమ్
యో యోజయతి సాహిత్యే తస్య వాణీ ప్రసీదతి. పు 14

లక్షణామార్గావగాహిత్వం తు ధ్వనేః సహృదయై ర్నూతనతయా ఉపవర్ణితస్య విద్యత ఇతి దిశ మున్మీలయితుం ఇద మత్రోక్తమ్ పు 21



# శంకుకభట్టు

నవమ శతాబ్దారంభమున మీమాంసకు డగు లోల్లటుడు రసము ఉత్పన్న మగున దని చెప్పినాడు ఇదే శతాబ్దము చివర వచ్చిన శంకుకుడు రసము అనుమేయ మనినాడు ఇతడు నైయాయికుడు. రసము సాక్షా దపరోక్షానుభూతి కా దని ఇతని వాదసారాంశము

విభావాదులద్వారా స్థాయియే రసముగా పరిణమించుటచే విభావాదులు అవగమకములు అని చెప్పవచ్చును ఈఅవగమకములు లేనిచో స్థాయిని తెలిసికొనలేము పొగ కన్పించిననే అచట నిప్పు కల దను జ్ఞానము అనుమాన ప్రమాణముద్వారా మనకు కల్గుచున్నది. అగ్ని కల దని సాధించుటకు ధూమప్రత్యక్షము కారణము ఇట్లే స్థాయి భావమును గూర్చి తెలిసికొనుటకు విభావాదులు హేతువులు. విభావాది ప్రత్యక్షజ్ఞానముద్వారా పరోక్షమున గల స్థాయిని సాధించుచున్నాము కనుక రసజ్ఞానము అనుమానప్రమాణముద్వారా సిద్ధ మగుచున్నది.

విభావాద్యనుపచిత మైనది స్థాయి యని తదుపచితావస్థారూపము రస మని లోల్లటాదుల వాదము. ఈవాదమును అంగీకరించినచో ప్రతి స్థాయిభావమున, ప్రతిరసమున అనేకరూపములు రాగలవు పరిపుష్ట మైన స్థాయియే రస మని లోల్లటు డనినచో, ఆరురూపములతో నున్న హాస్య రసమునకు ఆరుస్థాయిభావములు కావలెను పరప్రకర్షాధిగమమే రస నిష్పత్తి యనిన, శృంగారమున కల పదిఅవస్థలు పదిరసము లని చెప్ప వలసివచ్చును. రసపూర్వకత్వమే స్థాయిభావమునకు గల దని భరతుడు పలికినాడు

విభావము లనబడు హేతువులు, కార్యభూతము లగు అనుభావములు, సహచారిరూపము లగు సంచారి భావములు అనునవి నటునిచే ప్రయత్నపూర్వకముగా గ్రహింపబడినవి. నటుడు కావ్య ములోని పాత్రలను అనుకరించువాడు. స్థాయిభావము ఆయాపాత్ర లలో ఉన్నది గాని నటునియందు కాదు. కావ్యములోని పాత్రలకు

నటునకు గమ్యగమకసంబంధ మున్నది విభావములద్వారా రసజ్ఞానము అనుమానికముగా సిద్ధించునట్లు, నటుని అభినయముద్వారా ముఖ్యపాత్రలలో గల రసము అనుమానికముగా తెలియబడుచున్నది ముఖ్యపాత్రలకు చెందిన స్థాయికి అనుకరణరూపమై అనుకరణభావ మను లక్షణము గల రసము అను వేరొక పేరు స్థాయిభావమే పొందుచున్నది

ఒకని మనోగత మగు స్థాయిభావము మరొకనికి స్వాభావికముగా ఉండజాలదు ఒకని స్థాయిభావమును ఇతరుడు అనుకరించ గలడు ఈ అనుకరణను హేతువుగా గ్రహించి అనుమాన ప్రమాణముద్వారా మొదటి వానికి గల స్థాయిభావమును తెలిసికొనగలము స్థాయిభావముకంటె విలక్షణ మైన రసము లేదు. కనుక రససూత్రమున స్థాయిశబ్దము చెప్పబడ లేదు. ఈరసజ్ఞానము కావ్యానుమానసిద్ధము. కావ్యానుమానమున హేతు తుల్యము అగు విభావాదు లున్నవి.

---

# రాజశేఖర కవి

రాజశేఖరుడు 880 ప్రాంతము వాడు కాన్యకుబ్జాధిపతు లగు మహేంద్రపాల (903) మహీపాలదేవుల (917) ఆస్థానములలో నున్న రాజశేఖరుడు యాయావరకులమున మహారాష్ట్రదేశములో జన్మించెను 18 అధ్యాయములలో ఉన్న కావ్యమీమాంస కవులకు ఉపకరించు గ్రంథము శాస్త్రసంగ్రహము శాస్త్రనిర్దేశము. కావ్యపురుషోత్పత్తి. పదవాక్యవివేకము కావ్యపాకకల్పము పదవాక్యవివేకము పాఠప్రతిష్ఠ కావ్యార్థయోనులు మొద లగువిషయము లిచట వివేచింపబడినవి

వ్యాకరణ శాస్త్రముతో సంబంధము కల్గియున్న సాహిత్యశబ్దమును కావ్యపరముగా వాడినవారిలో మొట్టమొదటివాడు రాజశేఖరుడు కావచ్చును కుంతకుడు కూడ దాదాపు ఇదే సమయమున సాహిత్య శబ్దమును ఇట్లే వాడినాడు.

ఉక్తివిశేషమే కావ్య మని రాజశేఖరుడు పల్కినపుడు భట్ట నాయకుని మతము ఉద్ధృత మైనది శబ్దార్థముల సహభావమును వివరించునది సాహిత్యవిద్య. పదవిన్యాస మగు భంగిభణితియే ప్రధాన మని వస్తుస్వరూపమున కంతప్రాముఖ్యము లే దని అతనిభార్య అవంతి సుందరి అభిప్రాయము అందుచే కావ్యము ఉక్తి ప్రధాన మగును శబ్దార్థముల సహస్థితివలన వచ్చునది సాహిత్యము ఇందు మొదట వచ్చినది గద్యసాహిత్యము. కావ్యపురుషునకు సాహిత్యవిద్యా వధువుతో వత్సగుల్మమున వివాహము జరిపిన రాజశేఖరుడు సమీక్షాశాస్త్రమున క్రొత్తమార్గమును త్రొక్కినా డందురు కాని బహుశః ఇతనిభార్య యగు అవంతిసుందరి నేడు వాషిం అనబడు వత్సగుల్మమునకు చెందినది కానోపును

కావ్యమున విషయములు ఉన్నవి ఉన్నట్లు చెప్పబడుట లేదు కవిప్రతిభాసనిబంధన మైనవిషయములే ఇచట గలవు కవిభావన, రచనా విన్యాసము అనునవి ఒకేఒకవిషయమును అనేకవిధముల చూపగలవు

చంద్రుని పొగడదలచినపుడు అమృతాంశు డని, దూషించునపుడు దోషాకరు డని కవి అనగలడు కావ్యమున ఇది సత్యము, అది అసత్యము అని పలుకుటకు వీలు లేదు ఇచట కేవలము అర్థవాదములవంటి వాక్యములే కన్పింపగలవు కావున గుణాలంకారసహిత మైనదే కావ్య మని సిద్ధాంతము ఇట్టికావ్యము విధిపూర్వక మగు ఉపదేశమును చేయదు కాని నిషేధరూపమున ఉపదేశింపగలదు

ఇతడు చేష్టావిన్యాసక్రమమును వృత్తి అని వేషవిన్యాసక్రమమును ప్రవృత్తి అని వచనవిన్యాసక్రమమును రీతి అని నిర్వచించినాడు.

కవికి అంతరప్రయత్న మగు సమాధి బాహ్యప్రయత్న మగు అభ్యాసము అవసరము కవిత్వబీజ మగు వాసనలను ఉత్తేజింప జేయు శక్తిని ఈసమాధి అభ్యాసము మేల్కొలుపునవి ఈ శక్తిని ప్రతిభావ్యుత్పత్తులు వృద్ధి పొందింపజేయునవి. ప్రతిభ గలవానికి ఎదుట లేనిదికూడ ప్రత్యక్షముగా భాసించును

ఇట్టిప్రతిభను కారయిత్రి అని భావయిత్రి అని రెండువిధముల విభజించినాడు కావ్యకర్తకు సాయము చేయునది కారయిత్రి ఇది మరల మూడురగులు జన్మాంతర సంస్కారవశమున వచ్చునది సహజ మగు కారయిత్రి ఈజన్మలోని సంస్కారవశమున వచ్చునది ఆహార్య మగు కారయిత్రి మంత్ర తంత ఉపదేశాదులద్వారా కలుగునది ఔపదేశికి యగు కారయిత్రి ప్రాచీనులు సహజము ఉత్పాద్యము నగు ప్రతిభనే గ్రహించిరి మూడువిధములలో కన్పించు కారయిత్రివలన వరుసగా సారస్వత ఆభ్యాసిక ఔపదేశిక కవులు రాగలరు

సహృదయు డగు భావకునకు ఉపకరించు ప్రతిభను భావయిత్రి అందురు శబ్దయోజనలో కలుగు క్రమలోను అభిప్రాయమును వ్యక్తము చేయుటలోను ఉపకరించునది భావయిత్రి ఇది లేనిచో కవివ్యాపారము నిష్ఫల మగును శబ్దార్థసహితత్వము కవిత్వమున గల విషయము భావకత్వమునకు రసాస్వాదమే విషయము

ప్రతిభ వ్యుత్పత్తి అనునవి చక్కగా కలిసిపోయి యుండుట కావ్యరచనకు మంచిది ఈ రెండును కలవాడే కవి శాస్త్రకవి కావ్య

కవి ఉభయకవి అని కవులు మూడు విధముల గలరు శాస్త్రకావ్య కవులు తమతమప్రత్యేకపరిధులలో తుల్యప్రధానము కలవారు రచనా కవి శబ్దకవి అర్థకవి అలంకారకవి, ఉక్తికవి, రసకకవి, మార్గకవి, శాస్త్రార్థకవి అని ఎనిమిదిరకముల కావ్యకవు లున్నారు. ఈఎనిమిది విధములను మేళవింప జేయగలవాడే మహాకవి

## కావ్యమీమాంసా

ఉక్తివిశేషః కావ్యమ్ [కర్పూర మంజరి]
(ఉత్తివిసేసో కబ్బో )

పంచమీ సాహిత్యవిద్యా ఇతి యాయావరీయః సా హి చతసృణా మపి విద్యానాం నిష్యందః. (కా మీ 18)

శబ్దార్థయో ర్యథావత్ సహభావేన విద్యా సాహిత్యవిద్యా. (కా. మీ. 22)

'విదగ్ధ భణితిభంగి వేద్యం వస్తునో రూపం, న నియతస్వభావం' ఇతి అవంతిసుందరీ య దాహ- (146)

వస్తుస్వభావో ఽత్ర కవే రతంత్రః
గుణాగుణా వుక్తివశేన కావ్యే
స్తువ న్నిబధ్నా త్యమృతాంశు మిందుం
నిందంస్తు దోషాకర మాహ ధూర్తః

నా సత్యం నామ కిం చన కావ్యే యస్తు స్తుత్యే ష్వర్థవాదః న న పరం కవికర్మణి శ్రుతౌ చ శాస్త్రే చ లోకే చ ( 5)

అ స్త్యయ ముపదేశః, కింతు నిషేధ్యత్వేన, న విధేయత్వేన (90)

తత్ర వేషవిన్యాసక్రమః ప్రవృత్తిః విలాసవిన్యాసక్రమః వృత్తిః, వచనవిన్యాసక్రమః రీతిః. (పు 88)

గుణవ దలంకృతం చ కావ్యమ్ అసత్యార్థాభిధాయిత్వా న్నోపదేష్టవ్యం కావ్యం ఇ త్యేకే న ఇతి యాయావరీయః (81-85)

సమాధి రాంతరః ప్రయత్నో బాహ్య స్త్వభ్యాసః తా వుభా వపి శక్తి ముద్భాసయతః సా (శక్తిః) కేవలం కావ్య హేతు రితి యాయావరీయః (43)

ప్రతిభావ్యుత్పత్తీ మిథః సమవేతే శ్రేయసౌ ఇతి యాయావరీయః (57)

[ప్రతిభైవ చ కవీనాం కావ్యకరణకారణమ్ వ్యుత్పత్త్యభ్యాసౌ తస్యా ఏవ సంస్కారకారకౌ న తు కావ్యహేతూ వాగ్భటస్య అలం కా॰ తి॰]

ప్రతిభైవ వరకరః ఇతి యాయావరీయః (పు 163)

నామధాతుపారాయణే, అభిధానకోశః, ఛందోవిచితిః అలంకారతంత్రం చ కావ్యవిద్యాః (పు 155-6)

పురుషవత్ యోషితోఽపి కవీ భవేయుః సంస్కారో హ్యాత్మని సమవైతి న స్త్రైణం పౌరుషం వా విభాగ మపేక్షతే (171)

పూర్వే హి విద్వాంసః సహస్రశాఖం సాంగం చ వేద మవగాహ్య శాస్త్రాణి చావబుధ్య దేశాంతరాణి ద్వీపాంతరాణి చ పరిభ్రమ్య. యానర్థా నుపలభ్య ప్రణీతవంతః తేషాం దేశకాలాంతరవశేన అన్యథాత్వేఽపి తథాత్వే నోపనిబంధో యః స కవిసమయః. (230)

---

# భట్టనాయకుడు

క్రీ శ 920 సహృదయదర్పణము వ్రాసిన భట్టనాయకుడు ధ్వనికారుని మతమును త్రోసిపుచ్చిన వా డని మహిమభట్టు పల్కినాడు కాని ఇతడు వస్తుధ్వనిని దూషించి రసధ్వనిని చేపట్టినవా డని లోచనలో తెలియుటచే ఇతని దృష్టిలో ధ్వని యనునది కేవలము సహృదయ హృదయ సంవేద్యమే అనదగును అందుచే రసచర్వణము కావ్యాత్మగా గ్రహించినవాడు భట్ట నాయకుడు

కావ్యగత శబ్దమునకు అభిధ భావన అను రెండు వృత్తులతో పాటు భోగీకృతి అని రసచర్వణ అని, భోగ మని పిలువబడు మూడవ వృత్తి కలదు భావనావృత్తిద్వారా విభావాదులకు సాధారణీకరణ మన బడు విశ్వజనీనత్వము రాగలదు వాచ్యవిషయ మైనది అభిధా వ్యాపారము రసాదివిషయ మగునది భావకత్వము భోగకృత్వ మనునది సహృదయవిషయము కావ్యమున గల విభావాదులకు సాధార ణత్వము నాపాదించునది భావకత్వము భావింపబడినరసము భోగీకరణమున ఆస్వాద్య మగుచున్నది

రసము ప్రతీయమాన మగునది కాదు ఉత్పాద్యము కాదు అభివ్యఙ్గ్య మగునది కూడ కాదు అని భట్టనాయకుని వాదము రసము స్వనిష్ఠ ముగా ప్రతీత మైన దనినచో కరుణరసప్రదర్శనలో మానవునకు దుఃఖము కలుగవలెను కాని సీతాది విభావములు లేని సామాజికునకు ఈ దుఃఖము కలుగదు సీత దుఃఖమును గాంచు సామాజికునకు స్వకాంతాస్మరణము కలుగకపోవుటచే ఈ స్మృతివలన దుఃఖము కల్గుచున్న దనలేము

రసము నటగతముగా గాని కావ్యగతముగా గాని ప్రతీత మగునది అని పల్కినచో ఈ రసము మనలో భావస్పందము కలిగింప లే దని అంగీకరింపవలెను కాని సామాజికుడు ఉదాసీనుడుగా ఉండుట లేదు రస భావోద్రిక్తులము కావలె నన్నచో ప్రదర్శింపబడు రసావస్థ మనదే ఐయుండ వలెను రస ప్రతీతిలో ప్రమాతృప్రమే యాది వ్యవస్థ తొలగిపోవుచున్న దని భావము

దోషాభావము, గుణాలంకారమయము అగు కావ్యమున, నాల్గు విధముల అభినయముల విభావాదులు సాధారణీకరణము నందుచున్నవి ఈ సాధారణీకరణాత్మకముగా రసము అభిహిత మగుచున్నది అభిధా రూపమున నున్న రసము భావకత్వ వ్యాపారము ద్వారా భావింపబడుచున్నది భావనావ్యాపారవశమున రసము భావింపబడుచున్న దని భావము భావనా వ్యాపారమువలన పాత్రలతో సామాజికునకు అభేద ప్రతిపత్తి కలుగుచున్నది విభావాదులు ఈ భావనచే సమున్మిషితములై రసమునకు స్వగతత్వ ప్రతీతిని గాని పరగతత్వ ప్రతీతిని గాని ఈయజాలక తదతీత మగు అనుభూతిని ఒసగుచున్నవి ఈ అనుభూతిలో చిత్తమందలి రజస్తమో గుణములు సత్త్వగుణముగా పరిణమించుచున్నవి. అప్పుడు కలుగు సత్త్వోద్రేకమున ప్రకాశానందమయము నిజసంవిద్విశ్రాంతి లక్షణము, పరబ్రహ్మాస్వాద సదృశము అగు రసభోగము కలుగుచున్నది. ఇట్టి రసభోగము అలౌకికము

భట్టనాయకుడు రసప్రతీతిని అంగీకరింపక రసభోగమును గురించి పల్కినాడు రసప్రతీతిలో భావనావ్యాపారము కల దని అంగీకరించితిమేని రసభోగమునకు రసప్రతీతికి వైలక్షణ్యము కన్పింపదు ప్రతీతి భోగము రసన ప్రతిభానము చర్వణ ఆస్వాదన అనుభూతి అనునవి పర్యాయ పదములు

అభిధ, భావన భోగీకరణము అని మూడు వ్యాపారము లున్నవి శబ్దార్థాలంకారములతో నున్న కావ్యము అభిధా రూపము నందుచున్నది. భావనా వ్యాపారముచే భావ్యమాన మగు ఈ అభిధారూపము శృంగారాది రూపమున భాసించును అప్పుడు భోగీకరణ రూపమున ఈ రసములు అనుభూతము లగుచున్నవి ఈ భోగీకరణము రసమునకు అవసరము కాని ఎన్ని రసము లున్నవో అన్ని భోగీకరణము లున్న వని అభినవుడు ఎంచుట సరియైనది కాదు ఇట్లే రజస్తమో గుణములకు సత్త్వగుణముతో అంగాంగిభావము అనేక విధముల రాగల దని ఎంచుట కూడ పొరపాటు. ఒక్కొక్క గుణమును ఆధారము చేసికొని ఒక్కొక్క అంగాంగి భావమే రాగలదు

కావ్యానుశీలనమున రసములు భావింపబడు చున్నవి. విభావాది సంయోగముచే జన్మించు చర్వణాత్మక మైన ఆస్వాద రూపత్వమును ఆపాదించుటయే భావనా వ్యాపారము సాధారణీ కరణమునకు అతి ముఖ్య మగు ఈ భావనా వ్యాపారముద్వారా రసభోగము కల్గుచున్నది దీనినే రసము అభివ్యంజ్య మగుచున్న దని. పదములను మార్చి అభినవుడు పల్కినాడు రసము అభివ్యంజ్య మగున దనిచెప్పినను, భావనా వ్యాపారము లేనిదే రసమును ఆస్వాదింప జాలము.

ఇట్టి రసము ఒక్కటే అది శాంతరసము ఆ యా నిమిత్తముల ద్వారా శాంతమే వివిధ రసముల రూపమున భాసించుచున్నది అసత్యము నామరూప ప్రపంచాత్మకము అగు జగమే శ్రవణమననాదులద్వారా పరమ పురుషార్థమును పొందింప జేయుచున్నట్లే నాట్య శాస్త్రముకూడ లోకో త్తర మగు పరమ పురుషార్థమును సూచించున దగుటచే ఈ శాస్త్రము శాంతరసోపక్షేపక మగుచున్నది

ఎవని హృదయము తన్మయత్వము చెందుటకు తగిన సంవాద శీలము కలిగియున్నదో అతని భావనా వ్యాపారము రసాస్వాదమును పొందగలదు ఎండిన కట్టెను అగ్ని పూర్తిగా వ్యాపించునట్లు అట్టి సహృదయునియందు రసాన భూతి వెల్లువికి వచ్చుచుండును. ఇచట రసోత్పత్తి కన్పించుచున్నది కనుక వ్యంజనారూప మగు ధ్వని యను క్రొత్త వ్యాపారము ఉన్నట్లు సాధింప జాలము అభిద భావన అను రెండు వృత్తులే కలవు. కనుక కావ్యమున ధ్వని అను వేరు వ్యాపారము లేదు. ఇచ్చట అభిద భావన, రసచర్వణ అను మూడు వృత్తులు కల వని అభినవుడు వ్యాఖ్యానించుట యుక్తము కాదు. అభిధా వ్యాపారముచే ఉన్మిషిత మైన భావనా వ్యాపారము ద్వారా రసచర్వణ కల దని మాత్రమే భట్టనాయకుని వాదము రసచర్వణము భోగ మని వ్యవహరించినాడు కావ్యమును అస్వాదించుటకు రసచర్వణశీలుడే అధికారి ఇతిహాసాదులలో వలె బోద్ధ కాని వేదాదులలోవలె నియోగభాక్కు గాని కావ్యమునకు అధికారి కాడు

విభావాది తన్మయీభవన క్రమము ననుసరించి రసముతో నిండి యుండ నంతవరకు కావ్యమును కవి రసమయము చేయజాలడు రసముతో పూర్ణుడైననే తనలోని రసమునకు బాహ్యాకృతి నిచ్చి ఇతరులకు ఆస్వాదనీయము చేయగలడు భట్టనాయకుని రసభోగము అనుభవముకన్న స్మరణముకన్న ప్రతిపత్తికన్న విలక్షణము. ఇది చిత్తద్రుతి చిత్తవిస్తరము చిత్త వికాసము అను లక్షణములను క్రమముగా పొందునది అప్పుడు రజస్తమో గుణములు సత్త్వముగా పరిణమింపగా నిజచిత్స్వభావ నిర్వృతి విశ్రాంతి లక్షణ మగు పరబ్రహ్మాస్వాద సదృశ మైన ప్రతీతి రాగలదు.

శాస్త్రమున శబ్దము ప్రధాన మని ఇతిహాసాదులలో అర్థము ప్రధాన మని కావ్యమున శబ్దార్థములకు తుల్య ప్రాధాన్యము గల దని ప్రవచించిన భట్టనాయకుడు సాహిత్యమును నిర్దుష్టముగా నిర్వచించెను. ఉభయ ప్రాధాన్య మన్న సాహిత్యమున అభిధా భావనలకంటె భిన్న మైన ధ్వని యను వ్యాపారము ఉండుటకు వీలు కన్పింపదు ఒకవేళ ఉన్న దని చెప్పినచో అది విశిష్ట మగు శబ్ద వ్యాపార మని ప్రతీయమాన మని చెప్పలేము హృదయ సంవాదము కలుగగానే రసము ఉత్పన్నమై శరీర మంతట వ్యాపించి, ఆవేశించును ఈ రసచర్వణను ధ్వని విషయకముగా గ్రహింప జాలము

అభిధా భావనా చాన్యా తద్భోగీ కృతి రేవ చ
అభిధా ధామతాం యాతే శబ్దార్థాలంకృతీ తతః
భావనాభావ్య ఏషో హి శృంగారాదిగణో మతః
తద్భోగీ కృతిరూపేణ వ్యాప్యతే సిద్ధిమా న్నరః
దృశ్యమా.నాథవా మోక్షే యా త్యంగత్వమియం స్ఫుటమ్
(అ భా 279 అలంకారసర్వస్వ వ్యాఖ్యా.)

శబ్దప్రాధాన్య మాశ్రిత్య తత్ర శాస్త్రం పృథ గ్విదుః
అర్థతత్త్వేన యుక్తే తు వదం త్యాఖ్యాన మేతయోః
ద్వయో ర్గుణత్వే వ్యాపారప్రాధాన్యే కావ్యధీ ర్భవేత్.
(లో 87 అ భా. 2.293)

ధ్వని ర్నా మాపరో యోఽపి వ్యాపారో వ్యంజనాత్మకః
తస్య సిద్ధేఽ పి భేదే స్యా త్కా వ్యేంశత్వం న రూపితా.
లో. 89 జయరథ 10)

కావ్యే రసయితా సర్వో న బోద్ధా న నియోగభాక్ (లో 89)

వాగ్ధేను ర్దుగ్ధఏకం హి రసం యద్బాలతృష్ణయా
తేన నాస్య సమః స స్యా ద్దుహ్యతే యోగిభి ర్హి యః
(లో. 91-92)

యోఽ ర్థో హృదయసంవాదీ తస్యభావో రసోద్భవః
శరీరం వ్యాప్యతే తేన శుష్కం కాష్ఠ మి వాగ్నినా. (లో 89)

తథా తాదృగేవ విశ్వ మిద మసత్య నామరూప ప్రపంచాత్మక మథ చ శ్రవణమననాదివశేన పరమపుమర్థప్రాపక మితి లోకో త్తర పరమ పురుషార్థ సూచనేన శాంతరసోపదేశోఽ యం భవిష్యతి. "స్వంస్వం నిమి త్త మాసాద్య శాంతా దుత్పద్యతే రసః" ఇతి. త దనేన పారమార్థికం ప్రయోజన ము క్తమ్ ఇతి వ్యాఖ్యానం సహృదయదర్పణే పర్యగ్రహీత్.
(అ భా. 1 5)

యావ త్పూర్ణో న చై తేన తావ నైవ వమ త్యముమ్ (లో 87)

. రస్తః యదా పరగతతయా ప్రతీయతే తర్హి తాటస్థ్య మేవ స్యాత్ న చ స్వగతత్వేన రామాది చరితమయాత్ కావ్యా దసౌ ప్రతీయతే. స్వాత్మగతత్వేన చ ప్రతీ తౌ, స్వాత్మని రస స్యోత్ప త్తిరే వాభ్యు పగతా స్యాత్. సా చాయుక్తా సీతాయాః. సామాజికంప్ర త్యవిభా వత్వాత్. కాంతాత్వం సాధారణం వాసనావికా సహేతు విభావ తాయాం ప్రయోజక మితి చేత్- దేవతావర్ణనాదౌ త దపి కథమ్? న చ స్వకాంతాస్మ రణం మధ్యే సంవేద్యతే. అలోక సామాన్యానాం చ రామాదీనాం యే సముద్ర సేతుబంధాదయో విభావా స్తే కథం సాధా రణ్యం భజేయుః న చోత్సాహాదిమాన్ రామః స్మర్యతే, అననుభూత త్వాత్ శబ్దా దపి త త్ప్రతిపత్తౌ న రసోపజనః ప్రత్యక్షా దివ నాయక మిథున ప్రతిపత్తౌ. ఉత్ప త్తి పక్షే చ కరుణ స్యోత్పాదాద్ దుఃఖిత్వే

కరుణ ప్రేక్షాసు పున రప్రవృత్తిః స్యాత్ తన్న ఉత్పత్తిరపి, నాప్యభివ్యక్తిః శక్తిరూపస్య హి శృంగార స్యాభివ్యక్తౌ విషయార్జన తారతమ్య ప్రవృత్తిః స్యాత్. తత్రాపి కిం స్వగతో౽భివ్యజ్యతే రసః పరగతో వేతి పూర్వవ దేవ దోషః తేన న ప్రతీయతే, నోత్పద్యతే, నాభివ్యజ్యతే కావ్యేన రసః కిం త్వన్య శబ్దవైలక్షణ్యం కావ్యాత్మనః శబ్దస్య త్ర్యంశతా ప్రసాదాత్ తత్రాభిధాయకత్వం వాచ్యవిషయం, భావకత్వం రసాది విషయం భోగకృత్త్వం సహృదయ విషయ మితి త్రయో౽ంశభూతా వ్యాపారాః తత్రాఽభిధాభాగో యది శుద్ధః స్యా త్తత్తంత్రాదిభ్యః శాస్త్రన్యాయేభ్యః శ్లేషాద్యలంకారాణాం కో భేదః? వృత్తి భేదవైచిత్ర్యం చాకించిత్కరమ్ శ్రుతిదుష్టాది వర్జనం చ కి మర్థమ్? తేన రసభావనాఖ్యో ద్వితీయో వ్యాపారః, యద్వశా దభిధా విలక్షణైవ. తచ్చైతద్భావకత్వం నామ రసాన్ ప్రతి యత్కావ్యస్య తద్విభావాదీనాం సాధారణత్వాపాదనం నామ భావితే చ రసే తస్య భోగః, యో౽నుభవస్మరణ ప్రతిపత్తిభ్యో విలక్షణ ఏవ ద్రుతి విస్తర వికాసాత్మా రజస్తమో వైచిత్ర్యాననువిద్ధ సత్త్వమయ నిజచిత్స్వ భావ నిర్వృతి విశ్రాంతి లక్షణః పరబ్రహ్మాస్వాద సవిధః స ఏవ చ ప్రధాన భూతో౽ంశః సిద్ధరూప ఇతి. వ్యుత్పత్తి ర్నామా ప్రధానమే వేతి.

(శ్లో 180-188)

# తౌ త భ ట్టు

క్రీ శ 950. అభినవుని గురువు తౌతభట్టు కావ్యకౌతుక మను గ్రంథము రచించెను సర్వరసములలో ప్రధానతమ మైనది మోక్షఫలము గలది అగు శాంత రసమును తౌతభట్టు ప్రతిపాదించె నని 'లోచనములో' (ఠ 26) కలదు. కాని అంతకుముందే ఆనందవర్ధనుడు శాంతమును ప్రధాన మగు రసముగా గ్రహించెను తౌతభట్టు శాంతమునకు స్థాయ్యాదిభావ ములను వివరించి యుండవచ్చును ఆనందవర్ధనుని తర్వాత తౌతభట్టు నకు ముందు శాంతమును మహారసముగా చెప్పినవాడు భట్టనాయకుడు

ప్రీతిని ఆత్మగా గల్గినది రస మని ఇట్టి రసమే నాట్య మని తౌత భట్టు అనినాడు వర్ణింపబడిన వస్తువు కన్నులకు కట్టినట్లు భాసించినపుడే రస ప్రతీతి కలదు. ఈ రస ప్రతీతి కవికి నటునకు, సామాజికునకు కూడ ఉన్నది. వీరి అందరి ప్రతీతులు తుల్య మైనవి ఇట్టి ప్రతీతిని ఇచ్చుటకు కవికి ప్రతిభ అవసరము. నవనవోన్మేష శాలిని యగు ప్రజ్ఞయే ప్రతిభ.

ఋషి కానివాడు కవి కాజాలడు కవి యగుటకు ముందు ఋషి త్వము రావలెను సాక్షాత్కృత ధర్మము కలవాడు ఋషి అని యాస్క వచనము తత్త్వమును దర్శించిన వాడు ఋషి ఈ దర్శనమును వర్ణింపలచినపుడు ఋషియే కవి యగుచున్నాడు. విచిత్ర భావములను ధర్మములను అంశలను వ్యక్తము చేయు తత్త్వ ప్రఖ్యయే దర్శనము. తత్త్వ దర్శనము కవికి ఉండవలసిన మొదటి లక్షణము వాల్మీకి తత్త్వ దర్శన మున్నప్పటికిని వర్ణన ఆయనకు రానంతవరకు లౌకిక వాఙ్మయ మున ఆదికావ్యము ఉద్భవింపలేదు

> ప్రజ్ఞా నవనవోన్మేష శాలినీ ప్రతిభా మతా
>
> (ఔచిత్య విచార చర్చ, కా. 85)

> నా నృషిః కవి రిత్యుక్త మృషి శ్చ కిల దర్శనాత్
>
> విచిత్రభావ ధర్మాంశ తత్త్వ ప్రఖ్యా చ దర్శనమ్.

న త_త్వ దర్శనా దేవ శా_స్త్రేషు పఠితః కవిః
దర్శనా ద్వర్ణనా చ్చాథ రూఢా లోకే కవిశ్రుతిః
తథా హి దర్శనే స్వచ్ఛే నిత్యే ప్యాదికవేర్మునేః
నోదితా కవితా లోకే యావజ్జాతా న వర్ణనా॥
(హేమచంద్రస్య కావ్యానుశాసనమ్ పు 316)

ప్రీత్యాత్మా చ రసః త దేవ నాట్యం నాట్య మేవ చ వేద ఇ త్యస్మదుపాధ్యాయః (లో 184, 336)

కావ్యార్థ విషయే హి ప్రత్యక్ష కల్ప సంవేదనోదయే రసోదయ ఇ త్యుపాధ్యాయాః య దాహుః కావ్యకౌతుకే-

ప్రయోగత్వ మనాపన్నే కావ్యే నాస్వాదసంభవః, ఇతి
వర్ణనోత్కలికాభోగ ప్రౌఢోక్త్యా సమ్య గర్పితాః
ఉద్యాన కాంతా చంద్రాద్యా భావాః ప్రత్యక్షవ త్స్ఫుటాః ఇతి.
(నా శా. 6 36 పై అ భా. 1 '90-1)

య ద త్రా_స్తి న త త్రాస్య కవే ర్వర్ణన మర్హతి
య న్నాసంభవి తత్ర స్యాత్ సంభ వ్య త తు దర్శితః.
(అ. భా II 216)

నాయకస్య కవేః శ్రోతుః సమానో_ నుభవ _స్తతః.
(లో 92)

—

# ధనిక ధనంజయులు

ధనంజయుడు విష్ణుపుత్రుడు ముంజ మహీశుని కాలమున దశ రూపకమును రచించెను దశరూపక వ్యాఖ్యాత అగు ధనికుడు ఉత్పల రాజు పాలనలో ఉద్యోగిగా ఉండెను. ధనిక, ధనంజయులు సోదరులు ముంజ, వాక్పతిరాజ, ఉత్పలరాజ శబ్దములు ఒకే వ్యక్తి పేర్లుగా కనబడు చున్నవి ఉత్పలరాజు 974 నుండి 996 వరకు పాలించెను ధనికుడు తన అవలోకమును 1000 లో వ్రాసిన ట్లున్నది వీ రిరువురు అభినవుని సమ కాలికులు

వాక్యార్థము తాత్పర్యము ఐనది రస మని ధనంజయుడు ధ్వన్య మాన మగు అర్థము వాక్యార్థము కాజాలదు. ఇది తాత్పర్యశక్తినుండి జన్మింప జాలదు అభిధా వ్యాపారమున శబ్దముల ముఖ్యార్థము కలదు. తర్వాత వచ్చునది తాత్పర్యము శత్రువు నింటిలో భోజనమునకు పోవు పుత్రునితో "విషము తినుము' అని తండ్రి అనినపుడు, తాత్పర్యార్థము కన్న భిన్న మైన అర్థము వచ్చుచున్నది వాచ్యార్థము విధివంటిది కాని తండ్రి అభిప్రాయము నిషేధమును చెప్పునది. ఈ నిషేధమే ఇచట తాత్ప ర్యము కనుక వ్యంజనాశక్తి ఇట గల దని చెప్పరాదు అభిధేయార్థము బోధపడగానే తాత్పర్యము పూర్తి అగుట లేదు. తాత్పర్య విశ్రాంతి లేమ వక్త అభిప్రాయమును పూర్తిగా తెలియజేయునది తాత్పర్యశక్తి. అభిప్రాయ సమర్పణమే వాక్యార్థ మగుటచే లక్ష్య వ్యంగ్యార్థములు కూడ తాత్పర్యములో అంతర్భాగములే అప్పుడు అభిధాశక్తిద్వారా, తాత్పర్యశక్తిద్వారా కూడ రసాస్వాదము కలుగ గలదు కనుక రసము నకు స్వశబ్దోపాదనము దోషము కానేరదు కావ్యమ్మున విభావాదులు చెప్పబడగనే వీనితో సంబంధము గల స్థాయి భావమును గ్రహించు చున్నాము ఇది సశబ్దాభిధేయత్వము వంటిది కాదు కాని కొన్నిచోట్ల స్థాయిభావమును కవియే స్పష్టముగా చెప్పవచ్చును విభావాదులు శబ్ద ములవంటి వగుటచే వాక్యార్థమును పోలియుండు స్థాయిని మనకు అవి తెలియపగచుచున్నవి భావుకు డీ స్థాయిని తెలిసికొని రస చర్వణను పొంద గల్గుచున్నాడు ఇది అభిధానికమగు రత్యాది ప్రతీతి ఈ వాదము

నంగీకరించనివారు విభావాదులద్వారా లాక్షణిక మగు రత్యాది ప్రతీతి కలుగు ననవలెను రెండవ వాదము భాట్ట మీమాంసకులకు సమ్మతమైనది

తన వాదము భట్టనాయకుని వాదమునకు దగ్గరగా ఉన్న దని ధని కుడు చెప్పినాడు కావ్యమునకు రసమునకు గల సంబంధమును వాచ్య వాచక సంబంధ మనిగాని లక్ష్య లక్షక సంబంధ మని గాని చెప్ప వచ్చును కాని వాచ్య వాచక సంబంధమునే అంగీకరించిన ధనికుడు దీనిని భావ్యభావక సంబంధ మనినాడు భరతుడు భావశబ్దమును నిర్వచించుచు భావనను స్వీకరించెను కావ్యమున గల శబ్దార్థములు భావనను ప్రవృత్తము చేయ శక్తి కల్గియున్నవి రసమునకు స్వశబ్ద వాచ్యత్వమును భట్ట నాయకు డంగీకరింప లేదు

వాచ్య వ్యంగ్యముల సంబంధమును ఘట ప్రదీప న్యాయపరముగా వివరించిన ఆనందవర్ధనుని మతమును ధనికుడు తిరస్కరించెను ఒక విష యము దానితో ఎట్టి సంబంధము లేని వేరొక విషయమును తెలియజేయు టయే వ్యంజనా ప్రధాన స్వభావము ఘటము వేరు దీపము వేరు ఇవి వేర్వేరు కారణ సామగ్రులనుండి ఉత్పన్న మైనవి దీపము వలన ఘటము అభివ్యక్త మగుచున్నది కాని విభావాదులను వ్యంజకము లని చెప్పి నప్పుడు వీనికి వీనిద్వారా అభివ్యజ్యమాన మగు రసమునకు గల సంబం ధము ఘట ప్రదీప సంబంధము వంటిది కాజాలదు 'విభావాదులు రసము, అనునవి అత్యంత విలక్షణములు కావు. పైగా దీపమువలన ఘటము ఉత్పన్న మగుట లేదు కాని కావ్యమున రసమునకు విభావాదులకు సంబం ధము అతి సన్నిహితము కావున కావ్యమును వాక్యముగా గ్రహించి, విభావాదులను పదార్థములనుగా చెప్పి రసమును ధనికుడు వాక్యార్థ మనినాడు అప్పుడు నాట్యమును వాక్యార్థాభినయాత్మక మని, నృత్యమును పదార్థాభినయాత్మక మని చెప్పవచ్చును రసము వాక్యార్థ మగుటచే రూపకములలో రసము వాక్యార్థాభినయముద్వారా ఆస్వాదింపబడునది

చిత్తమున నాల్గు స్థితులను గమనింపవచ్చును. వీనిని వికాసము, విస్తరము క్షోభము, విక్షేపము అని అందురు. ఇవి వరుసగా శృంగార, వీర, బీభత్స, రౌద్రము లను ప్రధాన రసములకు సంబంధించినవి .భట్ట

నాయకుడు రసాస్వాద సమయమున చిత్తద్రుతి, విస్తర, వికాసములనే చెప్పినాడు.

స్వసంవేద్యము పరమానంద రూపము అగు రసాస్వాదమే దశరూపక ముల ఫలము. కనుక త్రివర్గాది వ్యుత్పత్తి మాత్రమే ప్రయోజన మని ఎంచు భామహాదుల మతము అంగీకార్యముకాదు దశరూపకములు రసము నాశ్రయించుకొని యున్నవి విభావములు అనుభావములు, సాత్త్విక భావములు సంచారి భావములు అనువానిద్వారా సామాజికుని యందు రత్యాదిస్థాయి భావములు నిర్భరానంద సంవిదాత్మకములుగా తీసికొని పోబడగా ఆస్వాదింపబడునవి రసములు. సామాజికులే రసికులు ధనిక ధనంజయులు శాంతము రసము కా దనిరి

## దశరూపకమ్

కః పున రేతేషాం కావ్యే వాపి సంబంధః? న తావ ద్వాచ్య వాచకభావః, స్వశబ్దై రనావేదితత్వాత్. న హి శృంగారాదిరసేషు కావ్యేషు శృంగారాదిశబ్దా శ్రూయంతే యేన తేషాం తత్పరిపోషస్య వాభిధేయత్వం స్యాత్ యత్రాపి చ శ్రూయంతే తత్రాపి విభావాది ద్వారక మేవ రసత్వ మేతేషాం న స్వశబ్దాభిధేయత్వ మాత్రేణ నాపి లక్ష్యలక్షకభావః తత్సామాన్యాభిధాయిన స్తు లక్షకస్య పద స్యాప్రయో గాత్ నాపి లక్షిత లక్షణయా తత్ప్రతిపత్తిః యథా గంగాయాం ఘోషః ఇత్యాదౌ తత్ర హి స్వార్థే స్రోతోలక్షణే ఘోష స్యావస్థానా సంభవాత్ స్వార్థే స్ఖలద్గతిః గంగాశబ్దః స్వార్థం వినా భూతార్థోపలక్షితం తట ముపలక్షయతి అత్ర తు నాయకాదిశబ్దాః స్వార్థే ఽస్ఖలద్గతయః కథ మి వార్థాంతర ముపలక్షయేయుః. కో వా నిమిత్త ప్రయోజనాభ్యాం వినా ముఖ్యే సత్యుపచరితం ప్రయుంజీత 'సింహో మాణవః' ఇత్యాది వత్ అత ఏవ గుణవృత్త్యాపి నేయం ప్రతీతిః యది వాచ్యత్వేన రస ప్రతీతిః స్యా త్తదా కేవల వాచ్య వాచక భావమాత్ర వ్యుత్పన్న చేతసా మ ప్యరసికానాం రసాస్వాదో భవేత్ న చ కాల్పనికత్వ మవిగానేన సర్వ సహృదయానాం రసాస్వాదోద్భూతేః అతః కేచి దభిధాలక్షణా

గౌణీభ్యో వాద్యాంతర పరికల్పిత శక్తిభ్యో వ్యతిరిక్తం వ్యంజకత్వ లక్షణం శబ్దవ్యాపారం రసాలంకార వస్తు విషయ మిచ్ఛంతి న చా సా వర్థాపత్తిజన్యా, అనుపపద్యమా నార్థాపేక్షా భావాత్ నాపి వాక్యా ర్థత్వం, వ్యంగ్యస్య తృతీయ కక్షా విషయత్వాత్ తథా హి– భ్రమ ధార్మిక ఇత్యాదౌ పదార్థ విషయాభిధా లక్షణ ప్రథమ కక్షాతిక్రాంత క్రియాకారక సంసర్గాత్మక విధివిషయ వాక్యార్థ కక్షాతిక్రాంత తృతీయ కక్షా క్రాంతో నిషేధాత్మా వ్యంగ్య లక్షణోఽర్థో వ్యంజక శక్త్యధీనః స్ఫుట మే వావభాసతే అతో నా సౌ వాక్యార్థః నను చ తృతీయ కక్షా విషయత్వ మశ్రూయమాణ పదార్థ తాత్పర్యేషు 'విషం భుంక్ష్వ' ఇత్యాది వాక్యేషు విషేధార్థ విషయేషు ప్రతీయత ఏవ వాక్యార్థే. న చాత్ర వ్యంజకత్వ వాదినాపి వాక్యార్థత్వం నేష్యతే, తాత్పర్యా దన న్యత్వాద్ధ్వనేః. త న్న స్వార్థస్య ద్వితీయ కక్షాయా మవిక్రాంతస్య తృతీయకక్షా భావాత్ సైవ నిషేధ కక్షా తత్ర ద్వితీయకక్షా విధౌ క్రియాకారక సంసర్గానుపపత్తేః ప్రకరణాత్ పితరి వక్తరి పుత్రస్య విష భక్షణ నియోగాభావాత్. రసవద్వాక్యేషు చ విభావ ప్రతిపత్తి లక్షణ ద్వితీయ కక్షాయాం రసా నవగమాత్ త దుక్తం–

> అప్రతిష్ఠ మవిక్రాంతం స్వార్థే య త్పరతా మిదమ్
> వాక్యం విగాహతే తత్ర న్యాయ్యా తత్పరతా స్య సా
> యత్ర తు స్వార్థ విక్రాంతం ప్రతిష్ఠాం తావ దాగతం
> త త్ప్రసర్పతి తత్ర స్యా త్సర్వత్ర ధ్వనినా స్థితిః

ఇ త్యేవం సర్వత్ర రసానాం వ్యంగ్యత్వ మేవ అ త్రోచ్యతే–

> వాచ్యా ప్రకరణాదిభ్యో బుద్ధిస్థా వా యథాక్రియా
> వాక్యార్థః కారకై ర్యుక్తా స్థాయీభావ స్త థేతరైః 4 37

యథా లౌకిక వాక్యేషు శ్రూయమాణ క్రియేషు గా మభ్యాజ– ఇత్యాది ష్వ శ్రూయమాణ క్రియేషు చ 'ద్వారం ద్వారం' ఇత్యాదిషు స్వశబ్దోపాదానాత్ ప్రకరణాది వశా ద్బుద్ధి సంనివేశినీ క్రి యైవ కార కోపచితా వాక్యార్థః, తథా కావ్యేష్వపి స్వశబ్దో పాదానాత్ క్వచిత్

ప్రీత్యై నవోఢా ప్రియా ఇత్యేవ మాదౌ క్వచి చ్చ ప్రకరణాది వశాత్ నియత విహిత విభావాద్యవినాభావా ద్వా సాహృదాద్భావక చేతసి వివరివర్తమానో రత్యాదిః స్థాయీ స్వస్వ విభావానుభావ వ్యభిచారిభిః తత్త చ్ఛబ్దోపనీతైః సంస్కార పరంపరయా పరాం ప్రౌఢి మానీయమానః రత్యాది వాక్యార్థః న చాపదార్థస్య వాక్యార్థత్వం నాస్తీతి వాచ్యం, కార్య పర్యవసాయిత్వాత్ తాత్పర్యశక్తేః తథా హి- పౌరుషేయ మపౌరుషేయం వాక్యం సర్వం కార్యపరం, అతత్పరత్వే అనుపాదేయత్వాత్ ఉన్మత్తాది వాక్యవత్ కావ్య శబ్దానాం చ అన్వయ వ్యతిరేకాభ్యాం నిరతిశయ సుఖాస్వాద వ్యతిరేకేణ ప్రతిపాద్య ప్రతిపాదకయోః ప్రవృత్తి విషయయోః ప్రయోజనాంతరా నుపలబ్ధేః స్వాదోద్భూతి రేవ కార్యత్వే నావధార్యతే తదుద్భూతి నిమిత్తత్వం చ విభావాది సంసృష్టస్య స్థాయిన ఏ వావగమ్యతే అతో వాక్య స్యాభిధానశక్తిః తేన తేన రసే నాకృష్యమాణా తత్తత్ స్వాదాపేక్షి తావాంతర విభావాది ప్రతిపాదన ద్వారా స్వపర్య వసాయితా మానీయతే. తత్ర విభావాదయః పదార్థ స్థానీయాః తత్సంసృష్టో రత్యాదిః వాక్యార్థః త దేతత్కావ్యం వాక్యం యదీయా తా విమౌ పదార్థ వాక్యార్థౌ న చైవం సతి గీతాదివత్ సుఖజనకత్వేఽపి వాచ్యవాచక భావానుపయోగః. విశిష్ట విభావాది సామగ్రీ విదుషా మేవ తథావిధ రత్యాది భావనావతా మేవ స్వాదోద్భూతేః త దనేన అతిప్రసంగోఽపి నిరస్తః. ఈదృశి చ వాక్యార్థ నిరూపణే పరికల్పితాభిధాది శక్తివశే నైవ సమస్త వాక్యార్థా వగతేః శక్త్యంతర పరికల్పనం ప్రయాసః. య దవోచామ కావ్య నిర్ణయే-

తాత్పర్యానతిరేకా చ్చ వ్యంజకత్వస్య న ధ్వనిః
కి ముక్తం స్యా దశ్రుతార్థ తాత్పర్యే ఽన్యోక్తి రూపిణి

విషం భక్షయ వాక్యే య చ్చైవం పితృసుతాదిషు
ప్రయుజ్యతే ప్రధానత్వా ద్ధ్వనిత్వం కేన వార్యతే.

ధ్వనిశ్చేత్ స్వార్థ విశ్రాంతం వాక్య మర్థాంతరాశ్రయమ్
తత్పరత్వం త్వవిశ్రాంతౌ, త న్న విశ్రాం త్యసంభవాత్.

ఏతావ త్యేవ విశ్రాంతిః తాత్పర్య స్యేతి కిం కృతమ్
యావ త్కార్య ప్రసారిత్వాత్ తాత్పర్యం న తులాధృతమ్.

భ్రమ ధార్మిక విశ్రబ్ధ మితి భ్రమికృతాస్పదమ్
నిర్వ్యావృత్తి కథం వాక్యం నిషేధ ముపసర్పతి

ప్రతిపాద్యస్య విశ్రాంతి రపేక్షాపూరణా ద్యది
వక్తు ర్వివక్షితా ప్రాప్తేః అవిశ్రాంతి ర్న వా కథమ్

పౌరుషేయస్య వాక్యస్య వివక్షా పరతంత్రతా
వక్త్రభిప్రేత తాత్పర్య మతః కావ్యస్య యుజ్యతే

ఇతి అతః న రసాదీనాం కావ్యేన సహ వ్యంగ్య వ్యంజక భావః కిం తర్హి? భావ్యభావక సంబంధః కావ్యం హి భావకం భావ్యా రసాదయః తే హి స్వతః భవంత ఏవ భావకేషు విశిష్ట విభావాదిమతా కావ్యేన భావ్యంతే న చాన్యత్ర శబ్దాంతరేషు భావ్యభావక లక్షణ సంబంధాభావాత్. కావ్య శబ్దే ష్వపి తథా భావ్య మితి వాచ్యమ్. భావనాక్రియా వాదిభిః త థాంగీ కృతత్వాత్. కిం చ మా చాన్యత్ర త థాస్తు అన్వయ వ్యతిరేకాభ్యా మిహ తథావగమాత్ త దుక్తం-

భావాభినయ సంబద్ధాన్ భావయంతి రసా నిమాన్
యస్మా త్తస్మా దమీ భావాః విజ్ఞేయా నాట్యయోక్తృభిః
(నా శా 7 4)

ఇతి కథం పునః అగృహీత సంబంధేభ్యః పదేభ్యః స్థాయ్యాది ప్రతిపత్తి రితి చేత్ లోకే తథావిధచేష్టాయుక్త స్త్రీపుంసాదిషు రత్యాద్యవినాభావ దర్శనాత్ ఇ హాపి తథోపనిబంధే సతి రత్యాద్య వినాభూత చేష్టాది ప్రతి పాదక శబ్ద శ్రవణాత్ అభిధేయావినాభావేన లాక్షణికీ రత్యాది ప్రతీతిః యథా చ కావ్యార్థస్య రసభావకత్వం త థాగ్రే వక్ష్యామః

రసః స ఏవ స్వాద్యత్వా ద్రసికస్యైవ వర్తనాత్
నానుకర్యస్య వృత్తత్వా త్కావ్య స్యాతత్పరత్వతః 4 38

ద్రష్టుః ప్రతీతి ర్వ్రీడేర్ష్యా రాగద్వేష ప్రసంగతః
లౌకికస్య స్వరమణీ సంయుక్త స్యేవ దర్శనాత్ 4 39

కిం చ న కావ్యం రామాదీనాం రసోపజననాయ కవిభిః ప్రవర్త్యతే; అపి తు సహృదయానానందయితుం స చ సమస్తభావక స్వసంవేద్య ఏవ ఏవం చ సతి రసాదీనాం వ్యంగ్యత్వ మపాస్తమ్ అన్యతో లబ్ధ సత్తాకం వస్త్వన్యే నాభివ్యజ్యతే ప్రదీపే నేవ ఘటాది న తు తదానీ మే వాభివ్యంజకత్వాభిమతై రాపాద్య స్వభావమ్ భావ్యంతే చ విభా వాదిభిః ప్రేక్షకేషు రసా ఇత్యావేదిత మేవ (పు 98 96)

రమ్యం జుగుప్సిత ముదార మథాపి నీచ
ముగ్రం ప్రసాది గహనం వికృతం చ వస్తు
యద్వా ప్యవస్తు కవిభావక భావ్యమానం
త న్నాస్తి య న్న రసభావ ముపైతి లోకే 4.85

స్వాదః కావ్యార్థ సంభేదా దాత్మానంద సముద్భవః
వికాసవిస్తరక్షోభ విక్షేపైః స చతుర్విధః. 4.43

శృంగార వీర బీభత్స రౌద్రేషు మనసః క్రమాత్
హాస్యాద్భుతభ యోత్కర్ష కరుణానాం త ఏవ హి. 4.44

అత స్తజ్జన్యతా తేషా మత ఏ వావధారణమ్ 4 45

ఆనంద నిష్యందిషు రూపకేషు వ్యుత్పత్తి మాత్రం ఫల మల్పబుద్ధిః
యోఽపి తిహాసా దివ దాహసాధు స్తస్మై నమః స్వాదు
పరాఙ్ముఖాయ 1 6

అవస్థానుకృతి ర్నాట్యం రూపం దృశ్యత యోచ్యతే
రూపకం తత్సమారోపాత్ దశధైవ రసాశ్రయమ్. 1 7

నాటకాది చ రస విషయమ్ రసస్య చ పదార్థీభూతవిభావాది సంసర్గాత్మక వాక్యార్థ హేతుత్వాత్ వాక్యార్థాభినయాత్మకత్వం రసా శ్రయ మి త్యనేన దర్శితమ్

. .

తథావిధ వాక్యార్థాభినయాత్మకా న్నాట్యాత్ పదార్థాభినయాత్మక మన్య దేవ నృత్య మితి. (పు 3 వృ 1.9)

విభావై రనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః
ఆనీయమానః స్వాద్యత్వం స్థాయీభావో రసః స్మృతః 4 1

విశేషా దాభిముఖ్యేన చరంతో వ్యభిచారిణః
స్థాయిన్యున్మగ్న నిర్మగ్నాః కల్లోలా ఇవ వారిధౌ 4 7

విరుద్ధై రవిరుద్ధై ర్వా భావై ర్విచ్ఛిద్యతే న యః
ఆత్మభావం నయ త్యన్యాన్ స స్థాయీ లవణాకరః 4 34



# అభినవగుప్త పాదులు

అభినవగుప్తుడు చుఖలు దని పిలువబడిన నృసింహాగుప్తుని కుమారుడు. 939 నుండి 949 వరకు పాలించిన యశస్కరుని మంత్రి యగు వల్లభుని కుమారునకు ఉపకరించుటకై పరాత్రింశికావ్యాఖ్యను రచించితి నని పల్కినాడు సాహిత్య శాస్త్రమును తౌతభట్టు, ఇందురాజు వద్ద అభ్యసించినాడు ఈశ్వర ప్రత్యభిజ్ఞా వివృతి విమర్శినిని 1014 లో పూర్తి చేసితి నని చెప్పుటచే 920-1020 ప్రాంతములో అభినవగుప్తుడు జీవించినట్లు చెప్పనగును

అభినవగుప్తుని 'లోచనము'లోను నాట్య వేదవివృతి యగు అభినవ భారతిలోను పూర్వు లగు భట్టనాయక తౌతభట్టుల వాదములు పూర్తిగా దొరలి పోయినవి

కావ్యానుశీలనమును తరచుగా చేయుటచే హృదయ మను దర్పణము నిర్మలమై తన్మయత్వమును పొందుటకు యోగ్యముగా నెవరికుండునో వారు సహృదయులు. అట్టి సహృదయులే కావ్యమును ఆస్వాదింపగలరు ఈ సహృదయులకు కావ్యమున రసధ్వని ప్రతీత మగుచున్నది. దీని వలన కవి ప్రీతినే మిన్నగా కోరువా డని గ్రహింపవలెను. వినువారికి కావ్యముద్వారా వ్యుత్పత్తి ప్రీతి కలుగుచున్నను, ప్రీతియే ముఖ్యము. ప్రభువువలె శాసించునవి వేదాదులు స్నేహితునివలె మందలించునవి ఇతిహాసాదులు ఇవి వ్యుత్పత్తి హేతువులు. కావ్యముకూడ వ్యుత్పత్తి నొసగగల్గినను భార్యవలె ప్రేమపూర్వకముగా హృదయమును ప్రవేశించునది అగుటచే ఇచట ఆనందమే ప్రధాన మైన ప్రయోజనము. పురుషార్థములలో నయితము ప్రధాన ప్రయోజనము ఆనందమే.

శబ్దములద్వారా హృదయ సంవాద మేర్పడును. ఇందు సుందర విభావానుభావములతో కలిసియున్న రత్యాది స్థాయి భావములు స్వసంవిదానంద చర్వణ యను వ్యాపారమున రసములుగా అనుభూతము లగుచున్నవి ఇది కావ్యవ్యాపారముననే కనిపించు రసధ్వని ఈ రసధ్వనియే కావ్యాత్మ

శబ్ద వ్యాపారములు మూడు కలవు మొదటిది అభిధా వ్యాపారము. సంకేత మగు శబ్దమును గ్రహించిన సమయముననే ఆ శబ్దము అర్థమును తెలియబరచు సామర్థ్యము కల్గియున్నచో అది అభిధా వ్యాపారము సామాన్యాత్మక పదార్థ విషయముననే ఈ అభిధా వ్యాపారము ప్రవృత్తము కాగలదు శబ్దము వ్యక్తిపర మైనపుడు అభిధావృత్తికి ప్రసక్తి లేదు అప్పుడు కన్పించునది రెండవది యగు తాత్పర్యశక్తి. "గంగమీద ఇల్లు' అనినపుడు, 'వీడు సింహము' అనినపుడు అన్వయార్థము కుదరదు గంగలో ఇల్లు ఇండుట అసంభవము. మానవుడు సింహ మగుట వట్టిది. ఇచ్చట ముఖ్యార్థబాధ కల్పించుచున్నది కావున తాత్పర్యమును గ్రహించి వీడు సింహము" అనినపుడు అర్థబోధ కన్పించదు. అన్వయార్థమునకు బాధక మైన వేరొక అర్థము ప్రతీత మగుటచే ఇచట మూడవ వ్యాపారమును గ్రహింపక తప్పదు. ఇది లక్షణా వ్యాపారము.

గుణాలంకారములతో ఉచిత మగు సుందర శబ్దార్థ శరీరము గల కావ్యమున ధ్వని అనునది ప్రతీతమైనపుడే ఆ కావ్యమునకు కావ్యరూపత రాగలదు కాని ముఖ్యార్థబాధ ఉన్నపుడు లక్షణార్థమును గ్రహింపవచ్చును ఈ లక్షణార్థముకూడ కుదరనిచో నాల్గవదియగు ధ్వనన వ్యాపారము అవసరము కాగలదు

"గంగమీద ఇల్లు" అనినపుడు "గంగ ఒడ్డున అని లక్షణార్థమును సాధించవచ్చును కాని గంగకు మనము ఆపాదించు పవిత్రత శీతలత్వము మొదలగు గుణములు కల ఇల్లు అను అర్థము అభిప్రేత మైనచో అభిధ తాత్పర్యశక్తి, లక్షణ అనునవి ఇక్కడ మనకు ఉపకరించవు అప్పుడు లక్షిత లక్షణను గ్రహించవలెనని కొందరు పల్కుట అర్థ రహితము లక్షిత లక్షణ అను శబ్ద వ్యాపారమును సాధింపలేము. నాల్గవ వ్యాపార మగు వ్యంజనను స్వీకరింపక తప్పదు దీనిని ధ్వననము, ద్యోతనము, వ్యంజన, ప్రత్యాయనము అవగమనము అని కూడ పిలుతురు. ధ్వనింపబడు అర్థమును సహృదయుడు మాత్రమే గ్రహింపగలడు

కావ్య ప్రతిపత్తిగల వానికి రసావేశము రాగలదు. దీనినే రసాభివ్యక్తి అందురు రసము వ్యంగ్యమే రస ప్రతిపత్తి గలవాని ప్రతిభయే ధ్వనన వ్యాపారమునకు ప్రాణము వేరొకచోట రసమే వాస్తవముగా కావ్యాత్మ అని వస్త్వలంకార ధ్వనులు రసమున పర్యవసింప వలెనని కావ్యాత్మ ధ్వని యనుట సామాన్యోక్తి అని అభినవు డనినాడు.

మహాకవి ప్రతిభావంతుడు అపూర్వవస్తు నిర్మాణక్షమమగు ప్రజ్ఞయే ప్రతిభ. రసావేశమువలన విమలమైన సౌందర్య భావము కలుగుటచే కావ్య నిర్మాణమునకు కావలసిన శక్తి కవికి వచ్చుచున్నది ఈ శక్తియే కవికిగల ప్రతిభా విశేషము ఇట్టి ప్రతిభా విశేషము గలవాడే మహాకవి మహా కావ్యమున శబ్దార్థములకు రెంటికిని వ్యంజనాశక్తి గలదు గనుక ధ్వనిని శ్రుతార్థాపత్తిగా గ్రహింప వీలులేదు ఈ ధ్వనివలన వాచ్య వాచకములకు చారుత్వము రాగలదు కనుక చారుత్వ ప్రతీతియే కావ్యాత్మ కాగల దని భట్టనాయకు డనినమాట అభినవునకు సమ్మతమే.

అభిధా వ్యాపారమున గాని, లక్షణగా గాని ధ్వనికి స్వీకరింప వీలు లేదు. సమగ్ర మైన వాక్యార్థము ప్రతీత మైన తర్వాతనే ధ్వనన వ్యాపారము బయలుదేరును అప్పుడు వ్యంగ్యార్థము ఆస్వాదింపబడుచున్నది. ఈ వ్యంజనను లక్షణార్థముగా గాని, గౌణార్థముగా గాని గ్రహింప వీలు లేదు

శబ్దార్థములకు రెంటికిని వ్యంజనార్థము కల దని చెప్పుచు, కావ్య శబ్దమును శబ్దార్థ సహితమని అభినవుడు నిర్వచించెను. కావ్యాత్మ రస ధ్వని యనపుడు మాధుర్యాది గుణములు రస గుణములే కాగలవు అవి శబ్దార్థ గుణము లనుట ఔపచారికము మాత్రమే వ్యంగ్యమునకు చారుత్వమును చెప్పునపుడు అది రసాభివ్యక్తి యోగతాత్మక మనియే భావము

గుణాలంకార మనోహర శబ్దార్థ శరీరము కలిగి, లోకోత్తర మైన రసమునే ప్రాణముగా కలిగిన కావ్యము హృదయ సంవాదము నొసగును అప్పుడు కలుగు చిత్తవృత్తి పాత్రల చిత్తవృత్తులలో నిమగ్న మగుచున్నది నిర్మల మైన అద్దమువలె నున్న హృదయ పద్మము గల సహృద

యునకు అభినయముద్వారా తన్మయత్వము కలుగుచున్నది. ఇది దేశ కాలములకు అతీత మగుటచే మిథ్యాసంశయ సంభావనాదులకన్న విలక్షణ మైన జ్ఞానము నొసగ జాలినది రామాదులను నటులు తమయందు ఆరో పించుకొని ప్రయోగగతులు కాగా హృద్య వస్తువులచేత, సంగీతముతోను సంస్కరింపబడిన మనస్సుకు విషయముతో అభేదబుద్ధి కలుగును అప్పుడు సహృదయుని సంవేదనలో విశ్వ మంతయు సంవిత్సంవేద్య మగును అందుచే ఉత్తమ కావ్యములోను, నాట్యమునను ఆత్మానుభూతియే కలుగును

రసము కావ్యమును ఆశ్రయించుకొని ఉండునది రసము అనునది నిర్విఘ్న స్వసంవేద నాత్మక మగు విశ్రాంతి లక్షణము కల్గినది రసమే నాట్యము నాట్యమే రసము ఈ రసము ఏకైకము వైయాకరణుల స్ఫోటవాదమును అనుసరించినచో శృంగారాది రసములకు ఈ రసము వివర్తోపాదనము. ప్రాభాకర మీమాంసకుల అన్వితాభిధానమును ఆశ్ర యించితిమేని శృంగారాదులు ఈ రసమునకు ఉపాయాత్మకములు కాగలవు భాట్టుల వాదమును గ్రహించితిమేని శృంగారాది రసముల సము దాయరూపమే నాట్య మనబడు రసము శృంగారాది రసములు తొమ్మిది. శాంతమును అంగీకరింపనివారు ఎనిమిదే రసము లని భరతుని వాక్యమును పఠించినారు

లోల్లట, శంకుక, భట్టనాయకాదుల వాదము లన్నింటిలోను రసము ప్రతీత మగుచున్న దనే భావమే కలదు. అప్రతీత మైనది వ్యవహార యోగ్యము కాదు. ఈ ప్రతీతిని చర్వణ అని ఆస్వాదన మని భోగ మని అనవచ్చును. ప్రతీయమానమగునదే రసము విశిష్టమగు రసనయే ప్రతీతి ఇది లౌకికానుమాన ప్రతీతికన్న విలక్షణము శాబ్ద ప్రతీతికన్నకూడ విలక్ష ణమే. ఈ ప్రతీతి వ్యంజనాత్మక మగు ధ్వనన వ్యాపారము. భట్టనాయకు డనిన భోగీకరణ వ్యాపారము రస విషయమున ధ్వనన వ్యాపారమే భావకత్వ మనగా సముచిత మగు గుణాలంకార పరిగ్రహాత్మక మని భావము వ్యంజకత్వ మను వ్యాపారముద్వారా గుణాలంకారౌచిత్యాది కము ఇతి కర్తవ్యతవలన కావ్యమున రసము భావింప బడుచున్నది. కనుక

భావనా వ్యాపారమును సాధనముగా గ్రహింపవలెను భోగీకరణమున సహితము చిత్తద్రుతి, విస్తర వికాసములద్వారా లోకోత్తర మగు ధ్వనన వ్యాపారమే కల్పించుచున్నది కావున రసములు అభివ్యఙ్గ్యములగు చున్నవి. అభివ్యక్తి ప్రధానమైనచో ధ్వని, అప్రధాన మైనచో రసవదా ద్యలంకారములు రాగలవు అభివ్యక్తి ప్రధాన మైనపుడు రస ప్రతీతిని పరబ్రహ్మా స్వాద సదృశ మని చెప్పవచ్చును.

కావ్యము సహృదయుని హృదయమును ఆవేశించునది హృద యాను ప్రవేశము రసాస్వాదమయమే చతుర్వర్గోపాయ జ్ఞానమును తీసి కొనివచ్చు విభావాది సంయోగమువలన కల్గున దీ రసము రసోచిత మగు విభావాదులద్వారా వచ్చు తన్మయత్వమునే ప్రీతి అందురు ఈ ప్రీతిని ఆశ్రయించుకొని యున్నది వ్యుత్పత్తి. ఈ ప్రీతి, వ్యుత్పత్తి అనునవి భిన్న విషయకములు కావు విభావాదుల ఔచిత్యమే ప్రీతికి హేతువు రసో చితము అగు విభావాదులద్వారా కలుగు స్వరూప సంవేదనమే వ్యుత్పత్తి. కావున కావ్యము తెచ్చు రసాస్వాదమున ప్రీతి వ్యుత్పత్తి అనునవి సంవ లితములై ఉన్నవి వీనిలో ప్రధాన మైనది ప్రీతి దీనినే అలౌకికానంద మందురు.

కావ్యగత శబ్దము చెవిన పడగానే విమల ప్రతిభానశాలి యగు సహృదయునకు విశిష్ట ప్రతిపత్తి కలుగుచున్నది. కావ్యార్థ ప్రతిపత్తి కల్గిన తర్వాత మానస సాక్షాత్కారము కలుగుచున్నది. రంగస్థలమున అభిజ్ఞాన శాకుంతలములోని మొదటి అంకమున గల హరిణము భావనా సమున్మిషిత మైన దగుటచే లౌకిక భయవిలక్షణముగా హరిణ భయము భాసించుచున్నది. ఈ భయము దేశకాలాద్యుపాధి రహితముగా మనకు ప్రతీతిలో కల్పించుచున్నది. భావనా వ్యాపార వశమున కావ్యగత హరి ణము విలక్షణముగా కల్పించుచున్నది నిర్విఘ్న ప్రతీతిగ్రాహ్య మగు భయానక రసము సాక్షాత్తుగా హృదయమును ప్రవేశించినట్లు కన్నుల ముందు మెరయుచు ప్రతీయమాన మగుచున్నది ఇట్టి భయమున స్వాత్మా వేశము కలుగుటచే సాధారణీకరణము వచ్చుచున్నది ఈ సాధారణీ కరణము హృదయ సంవాద నిష్ఠము. అనాదివాసనా చిత్రీకృత చిత్త

ములు గల మానవుల కున్న వాసనా సంవాద వశమున సామాజికుల కంద రకు అద్వితీయ ప్రతిపత్తి కలుగుచున్నది ఇట్లు నిర్విఘ్న స్వసంవేదనమున రసపరిపోషము కల్గుచున్నది ఈ నిర్విఘ్న సంవిత్తును చమత్కార మని అందురు.

సాక్షాత్కార స్వభావ మగు రస ప్రతీతిని ప్రతిభాన మందురు ఆస్వాదాత్మక ప్రతీతిలో రసము భాసించుచున్నది విశేషాంతరానుపహిత మగుచు రసనీయ మైన ఈ ఆస్వాదము లౌకికము గాని లౌకిక తుల్యము గాని, తదారోపాది రూపము గాని, మిథ్య గాని అనిర్వచనీయము గాని కాజాలదు ఈ రసము నిర్విఘ్న ప్రతీతిగ్రాహ్యము ఇది స్మృతి అను మానము లౌకిక సంవేదనము మొదలగు వానికంటె విలక్షణము రస చర్వణ లౌకికము లగు ప్రత్యక్షాది ప్రమాణములను అపేక్షింపదు. ఇది అలౌకిక విభావాది సంయోగ వశమున వచ్చునది స్వసంవేదన సిద్ధ మైన రసనా వ్యాపారము బోధరూపము. ఇది ఇతర లౌకిక బోధ రూపముల కన్న విలక్షణము.

రస సముదాయమే నాట్యము నాట్యముననే రసము లున్న వని చెప్పరాదు నాట్యమునకు యోగ్య మగు కావ్యమున కూడ రసము కలదు కావ్య మనగా ముఖ్యముగా నాటకమే అని అభినవుని వాదము నాటకమున గల పాత్ర వేరు, నటుడు వేరు రస ప్రతీతికి సాధనముగా ఉపకరించువాడు నటుడు దేశము కాలము, ప్రమాత అను భేదములకు లోను కానిది రసము అప్పుడు రసము నటనిష్ఠము కాదు, ప్రమాతృ నిష్ఠముకూడ కాదు

కవియం దున్న సాధారణీకరణమును తెచ్చిన సంవిత్తునే వాస్తవ ముగా రస మనవలెను కవి యం దున్న రసము విత్తనము వంటిది ఈ కవికి సామాజికునకు సామ్య ముండుటచే కవిగత రసము మనకు ప్రతీత మగుచున్నది. కావ్యము వృక్షము వంటిది పుష్పాదులవంటిది అభి నయాది నటవ్యాపారము సామాజిక రసాస్వాదము ఫలమువంటిది కావున విశ్వమే రసమయము

అభినవుని మతమున శాంతరసము ముఖ్యమైనది. శమమును స్థాయిగా గల్గిన శాంతరసమే మహారసము శృంగారాదుల కిది వివర్తోపాదానమే గాక, రసముల కన్నింటికి శాంతరస పర్యవసాయిత్వమును విధించినాడు.

లోకధర్మిలో వాస్తవమైన చిత్తవృత్తులే అనుభావములలో గాని, కావ్యోక్తిలో గాని కన్పించ వచ్చును నాట్యోపయోగమునకు మూలమగు కైశికి మొదలైన వృత్తులద్వారా అలౌకికశోభ బయలుదేరినచో అది నాట్యధర్మిని తెలుపునది కొన్ని సన్నివేశములలో ఈ రెండును కలిసి యుండ వీలున్నది. కావ్యము గాని, నాట్యము కాని లోకమును అనుసరించుట, లేక వైచిత్ర్యమును చూపుట, అనునవి ధర్మము లని పిలువబడునవి

# లోచన వ్యాఖ్యా

యేషాం కావ్యానుశీలనాభ్యాసవశా ద్విశదీభూతే మనోముకురే వర్ణనీయ తన్మయీభవన యోగ్యతా తే స్వహృదయ సంవాద భాజః సహృదయాః. (లో 38—39)

ఆనంద ఇతి రస చర్వణాత్మనః ప్రాధాన్యం దర్శయన్ రసధ్వనే రేవ సర్వత్ర ముఖ్యభూత మాత్మత్వ మితి దర్శయతి. (లో 69)

రసధ్వనే ర్జీవితత్వమ్ (లో. 45)

తత్ర కవే స్తావత్ కీర్త్యాపి ప్రీతి రేవ సంపాద్యా యదాహ— 'కీర్తిం స్వర్గఫల మాహుః' ఇత్యాది తథాపి ప్రీతి రేవ ప్రధానమ్. అన్యథా ప్రభు సంమితేభ్యో వేదాదిభ్యో, మిత్ర సంమితేభ్య శ్చేతిహాసాదిభ్యో. వ్యుత్పత్తి హేతుభ్యః కోఽస్య కావ్యరూపస్య వ్యుత్పత్తిహేతోః జాయాసంమితత్వ లక్షణో విశేష ఇతి ప్రాధాన్యేన ఆనంద ఏవోక్తః. చతుర్వర్గ వ్యుత్పత్తే రపి చానంద ఏవ పార్యంతికం ఫలమ్ (లో 4^– 1)

శబ్ద సమర్ప్యమాణ హృదయ సంవాద సుందర విభావానుభావ సముచిత ప్రాగ్వినివిష్ట రత్యాది వాసనానురాగ సుకుమార సంవిదానంద చర్వణావ్యాపార రసనీయ రూపో రసః స కావ్య వ్యాపారైక గోచరో రసధ్వని రితి సచ ధ్వని రే వేతి సఏవ ముఖ్యతయా ఆత్మేతి (లో 5:–52)

త్రయో హ్యత్ర వ్యాపారాః సంవేద్యంతే. పదార్థేషు సామాన్యాత్మ స్వభిధా వ్యాపారః సమయాపేక్ష యార్థావ గమన శక్తి ర్హి అభిధా. సమయశ్చ తావ త్యేవ న విశేషాంశే ఆనంత్యా ద్వ్యభిచారా చ్చైకస్య. తతో విశేషరూపే వాక్యార్థే తాత్పర్యశక్తిః పరస్పరాన్వితే సామాన్యా న్యన్యథాసిద్ధే ర్విశేషం గమయంతి హి ఇతి న్యాయాత్.

ముఖ్యార్థ బాధాయాం లక్షణాయాః ప్రక్లుప్తిః బాధా చ విరోధ ప్రతీతి రేవ న చాత్ర పదార్థానాం స్వాత్మని విరోధః పర

స్ఫురం విరోధ ఇతి చేత్- సోఽయం తర్హి అన్వయే విరోధః ప్రత్యేయః. న చాప్రతిపన్నేఽన్వయే విరోధ ప్రతీతిః ప్రతిపత్తిశ్చ అన్వయస్య నాభిధా శక్త్యా, తస్యాః పదార్థ ప్రతిపత్త్యుపక్షీణాయా విరమ్య వ్యాపారా దితి తాత్పర్య శక్త్యై వాన్వయ ప్రతిపత్తిః సింహో మాణవక ఇత్యత్ర ద్వితీయ కక్ష్యానివిష్ట తాత్పర్యశక్తి సమర్పి తాన్వయ బాధకోల్లాసానంతర మభిధా తాత్పర్యశక్తి ద్వయ వ్యతిరిక్తా తావత్ తృతీయైవ శక్తిః తద్బాధక విధురీకరణ నిపుణా లక్షణాభిధానా సముల్లసతి (లో. 56-57)

అత ఏవ యత్కైశ్చి ల్లక్షితలక్షణేతి నామకృతం తద్వ్యసన మాత్రమ్ తస్మా దభిధాతాత్పర్య లక్షణా వ్యతిరిక్తః చతుర్థోఽసౌ వ్యాపారో ధ్వనన ద్యోతన వ్యంజన ప్రత్యాయ నావగమనాది సోదర వ్యపదేశ నిరూపితోఽభ్యుపగంతవ్యః తేన సమయాపేక్షా వాచ్యావగమనశక్తి రభిధాశక్తిః. త దన్యథానుపపత్తి సహాయార్థావబోధన శక్తి స్తాత్పర్య శక్తిః. ముఖ్యార్థ బాధాది సహకార్యపేక్షార్థ ప్రతిభాసనశక్తిః లక్షణాశక్తిః తచ్ఛక్తిత్రయోపజనితార్థావగమ మూలజాత తత్ప్రతిభాస పవిత్రిత ప్రతిపత్తృ ప్రతిభా సహాయార్థ ద్యోతనశక్తిః ధ్వనన వ్యాపారః స చ ప్రాగ్వృత్తం వ్యాపారత్రయం న్యక్కుర్వన్ ప్రధాన భూతః కావ్యాత్మా (లో. 61-63)

ప్రతిపత్తిశ్చ రసావేశో రసాభివ్యక్త్యైవ. రస శ్చ వ్యంగ్య ఏవ. (లో. 68)

తేన రస ఏవ వస్తుత ఆత్మా. వస్త్వలంకార ధ్వనీ తు సర్వథా రసం ప్రతి పర్యవస్యేతే ఇతి వాచ్యా దుత్కృష్టౌ తా విత్యభిప్రాయేణ 'ధ్వనిః కావ్య స్యాత్మే' తి సామాన్యే నోక్తమ్. (లో. 85)

ప్రతిపత్తౄన్ ప్రతి సా ప్రతిభా నానుమీయమానా, అపి తు తదావేశేన భాసమానే త్యర్థః ప్రతిభా అపూర్వ వస్తు నిర్మాణక్షమా ప్రజ్ఞా. తస్యా విశేషో రసావేశ వైశద్య సౌందర్యం కావ్య నిర్మాణక్షమత్వమ్. (లో. 92-93)

కావ్యగ్రహణాత్ గుణాలంకారోపస్కృత శబ్దార్థ పృష్ఠపాతీ ధ్వనిలక్షణ ఆత్మే త్యుక్తమ్ త న్నైత న్నిరవకాశం శ్రుతార్థాపత్త్యా వపి ధ్వనివ్యవహారః స్యా దితి య చ్చోక్తం -చారుత్వ ప్రతీతి స్తర్హి కావ్య స్యాత్మా స్యా దితి, తదంగీకుర్మ ఏవ నామ్ని ఖ ల్వయం వివాద ఇతి (లో 104-5)

కావ్య మితి శబ్దార్థా వి త్యర్థః. (లో. 205)

వర్ణనీయ వస్తునిష్ఠః ప్రజ్ఞావిశేషః ప్రతిభానమ్. (లో 522)

కవనీయం కావ్యం, తస్య భావః కావ్యత్వమ్. న త్వయం భావ ప్రత్యయాంతాత్ భావ ప్రత్యయ ఇతి శంకితవ్యమ్. (లో. 688)

సర్వపక్షేషు చ ప్రతీతి రపరిహార్యా రసస్య. అప్రతీతం హి పిశాచవ దవ్యవహార్యం స్యాత్. కింతు యథా ప్రతీతి మాత్రత్వే నావిశిష్టత్వేఽ పి ప్రాత్యక్షికీ, ఆనుమానికీ, ఆగమోత్థా, ప్రతిభానకృతా, యోగిప్రత్యక్షజా చ ప్రతీతి రూపాయ వైలక్షణ్యా దన్యైవ, తద్వదియ మపి ప్రతీతి శ్చర్వణాస్వాదన భోగాపరనామా భవతు తన్నిదాన భూతాయా హృదయ సంవాదా ద్యుపకృతాయా విభావాది సామగ్ర్యా లోకోత్తర రూపత్వాత్. రసాః ప్రతీయంత ఇతి ఓదనం పచ తీతివద్ వ్యవహారః ప్రతీయమాన ఏవ హి రసః ప్రతీతి రేవ విశిష్టా రసనా. సా చ నాట్యే లౌకి కానుమాన ప్రతీతేః విలక్షణా, తాం చ ప్రముఖే ఉపాయతయా సందధానా ఏవం కావ్యే అన్యశాబ్ద ప్రతీతే ర్విలక్షణా, తాం చ ప్రముఖే ఉపాయత యాపేక్షమాణా.
(లో. 187)

ప్రతీతి స్తావ ద్రసస్య సిద్ధా. సా చ రసనారూపా ప్రతీతి రుత్పద్యతే. వాచ్యవాచకయో స్త త్రాభిధాది వివిక్తో వ్యంజనాత్మా ధ్వనన వ్యాపార ఏవ. భోగీకరణ వ్యాపార శ్చ కావ్యస్య రసవిషయో ధ్వననాత్మైవ నా న్యత్ కించిత్. భావకత్వ మపి సముచిత గుణాలంకార పరిగ్రహాత్మక మస్మాభి రేవ వితత్య వక్ష్యతే. (లో 188)

తస్మా ద్వ్యంజకత్వాఖ్యేన వ్యాపారేణ గుణాలంకారౌచిత్యాదిక యేతి కర్తవ్యతయా కావ్యం భావకం రసాన్ భావయతి, ఇతి త్ర్యంశా యా మపి భావనాయాం కరణాంశే ధ్వనన మేవ నిపతతి భోగోఽ పి న కావ్యశబ్దేన క్రియతే అపి తు ఘనమోహాంధ్యసంకటతా నివృత్తి ద్వారే ణాస్వాదాపర నామ్ని అలౌకికే ద్రుతివిస్తరవికాసాత్మని భోగేకర్తవ్యే లోకోత్తరే ధ్వనన వ్యాపార ఏవ మూర్ధాభిషిక్తః. త చ్చేదం భోగకృ త్వం రసస్య ధ్వననీయత్వే సిద్ధే దైవసిద్ధమ్ రస్యమాన తోదిత చమ త్కారానతిరిక్తత్వా ద్భోగ స్యేతి సత్త్వాదీనాం చాంగాంగి భావ వైచిత్ర స్యానంత్యాద్ ద్రుత్యాదిత్వే నాస్వాదగణనా న యుక్తా. పరబ్రహ్మా స్వాద సబ్రహ్మచారిత్వం చా స్త్వస్య రసా స్వాదస్య తస్మాత్ స్థిత మేతత్ -అభివ్యజ్యంతే రసాః ప్రతీత్యైవ చ రస్యంత ఇతి. త త్రాభివ్యక్తిః ప్రధానతయా భవ త్యన్యథా వా. ప్రధానత్వే ధ్వనిః, అన్యథా రసాద్యలంకారాః (లో 189-190)

హృదయాను ప్రవేశ శ్చ రసాస్వాదమయ ఏవ. న చ రసః చతు ర్వర్గోపాయ వ్యుత్పత్తి నాంతరీయక విభావాది సంయోగ ప్రసాదోపనత ఇ త్యేవం రసోచిత విభావా ద్యుపనిబంధే రసాస్వాదవైవశ్య మేవ స్వరస భావిన్యాం వ్యుత్పత్తౌ ప్రయోజక మితి ప్రీతిరేవ వ్యుత్పత్తేః ప్రయోజికా. ప్రీత్యాత్మా చ రసః త దేవ నాట్యం. నాట్య మేవ చ వేద ఇ త్యస్మదుపా ధ్యాయః. న చైతే ప్రీతివ్యుత్పత్తీ భిన్నరూపే ఏవ, ద్వయో రప్యేక విషయత్వాత్ విభావాద్యౌచిత్యమేవ హి సత్యతః ప్రీతేః నిదాన మి త్యసకృ దవోచామ విభావాదీనాం తద్రసోచితానాం యథాస్వరూపవేద నం ఫలపర్యంతీభూతతయా వ్యుత్పత్తి రి త్యుచ్యతే. ఫలం చ వామ య దదృష్టవశా ద్దేవతా ప్రసాదా దన్యతో వా జాయతే (లో 336-337)

వ్యంగ్యస్య చ చారుత్వం రసాభివ్యక్తియోగ్యతాత్మకమ్ రసస్య స్వాత్మన్యేవ విశ్రాంతిధామ ఆనందాత్మకత్వ మితి నానవస్థా కాచిత్ (లో 478)

కావ్యే తు గుణాలంకార మనోహర శబ్దార్థ శరీరే, లోకోత్తర రసప్రాణకే, హృదయ సంవాదవశాత్ నిమగ్నాకారికా తావద్ భవతి చిత్త వృత్తిః విమలముకుర కల్పీభూత నిజహృదయాః సూచ్యాద్యభిఃయావలోకనోద్భిన్న ప్రమోద శోకాదితన్మయీభావాః పాఠ్యాకర్ణన పాత్రాంతర ప్రవేశవశాత్ సముత్పన్నే దేశకాల విశేషావేశానాలింగితే సమ్యఙ్మిథ్యాసంశయ సంభావనాదిజ్ఞాన విజ్ఞేయత్వ పరామర్శావాస్పదే, రామరావణాది విషయాధ్యవసాయే, తత్సంస్కారానువృత్తి కారణభూత తత్సహచర హృద్యవస్తురూప గీతాతోద్య ప్రముదానుభవ సంస్కార సూచిత సమనుగత తదుక్తరూప రామాధ్యవసాయసంస్కార ఏవ భవత్ పంచషై ర్దివసైః సచమత్కార తదీయచరిత మధ్యప్రవిష్ట స్వాత్మరూప మతిః స్వాత్మద్వారారేణ విశ్వం తథా పశ్యన్ ప్రత్యేకం సామాజికో దేశ కాలవిశేషణా పరామర్శేన ఏవంకారిణా మిద మితి లిఙాత్మక విధిసమర్పితం సంవిజ్జాతీయ మేవ సంవిద్విశేషరంజక ప్రాణవల్లభాప్రతిమ రసాస్వాద సహచర రమ్యగీతాతోద్యాది సంస్కారానుభవవశేన హృదయాభ్యంతర నిఖాతం తత ఏవో త్పుంఖశతై రపి మ్లానిమాత్ర మవ్యభజమానం భజం స్తత్తచ్ఛుభాశుభప్రేప్సా జిహాసా సతతస్యూతవృత్తిత్వా దేవ శుభ మాచర త్యశుభం సముజ్ఝతి. ఇదానీ ముపాయసంవేదనాలాభాత్ త దిద మనుకీర్తన మనువ్యవసాయ విశేషో నాట్యాపరపర్యాయః.

అ. భా. I 36

ప్రీతిం రసనారూపాం చర్వణాలక్షణాం కరోతి.

అ. భా. I. 35

సాధారణీ భూతతయా సామాజికా నపి స్వాత్మ సద్భావేన సమావేశయంతి తాదాత్మ్యా దేవ దానుమానాగమయోగి ప్రత్యాక్షాదికరణక తటస్థ ప్రమాతృప్రమేయ పరకీయలౌకిక చిత్తవృత్తివిలక్షణతయా నిర్భాసమానా పరిమిత స్వాత్మాన్యాశ్రయతా నిర్భాసనా విరహా చ్చ లౌకిక ప్రమాదాదిజనిత నిజరతశోకాదివత్ తజ్జహానాదిచిత్త వృత్త్యంతర జననాక్షమా తత ఏవ నిర్విఘ్నస్వసంవేదనాత్మక విశ్రాంతిలక్షణేన రసనాపర

పర్యాయేణ వ్యాపారేణ గృహ్యమాణత్వా ద్రసశబ్దే నాభిధీయతే తేన రస ఏవ నాట్యమ్ యస్య వ్యుత్పత్తిః ఫల మి త్యుచ్యతే తథా చ రసా దృత" ఇ త్యత్రై కవచనోపపత్తిః తతశ్చ ముఖ్యభూతాత్ మహా రసాత్ స్ఫోటదృశీ వాసత్యాని వా అన్వితాభిధాన దృశీవోపాయాత్మ కాని సత్యాని వా అభిహితాన్వయదృశీవ తత్సముదాయరూపాణి వా రసాంతరాణి భావాభినివేశదృష్టాని రూప్యంతే I 266 7

ప్రథమం రసాః తే చ నవ శాంతాపలాపిన స్త్వష్టా విత తత్ర పఠంతి 1 267

సర్వసామాజికానాం ఏకఘనత యైవ ప్రతిప్రత్తిః సుతరాం రసపరి పోషాయ. సర్వేషా మనాదివాసనా చిత్రీకృత చేతసాం వాసనాసంవా దాత్ సా చావిఘ్నా సంవిత్. 1 279

విశేషాంతరానుపహితత్వాత్ సా రసనీయా సతీ న లౌకికీ న మిథ్యా నానిర్వాచ్యా. న లౌకికతుల్యా. న తదారోపాదిరూపా 1.280

లౌకిక చిత్తవృత్త్యనుమానే కా రసతా? తే నాలౌకిక చమత్కా రాత్మా రసాస్వాదః స్మృత్యనుమాన లౌకిక సంవేదన విలక్షణ ఏవ. 1 284

సా చ రసనా న ప్రమాణ వ్యాపారో, న కారకవ్యాపారః స్వయం తు నాప్రామాణికః, స్వసంవేదన సిద్ధత్వాత్ రసనా చ బోధరూ పైవ కిం తు బోధాంతరేభ్యో లౌకికేభ్యో విలక్షణైవ ఉపాయానాం విభావాదీనాం లౌకిక వైలక్షణ్యాత్. తేన విభావాది సంయోగా ద్రసనా యతో నిష్పద్యతే ఽత స్తథావిధరసనాగోచరో లోకో త్తరోఽ ర్థో రస ఇతి తాత్పర్యం సూత్రస్య. 1 285

రససముదాయో హి నాట్యమ్. న నాట్య ఏవ చ రసాః కావ్యేఽ పి నాట్యాయమాన ఏవ రసః 1 290

కావ్యం తావ న్ముఖ్యతో దశరూపకాత్మక మేవ

నచే న రసః కుత్ర తర్హి? విస్మృతిశీలో న బోధ్యతే. ఉక్తం హి దేశకాల ప్రమాతృభేదానియంత్రితో రస ఇతి నచే తర్హి కిం ఆస్వాద నోపాయః? అత ఏవ పాత్ర మి త్యుచ్యతే 1.291

కవిగత సాధారణీభూత సంవిన్మూల శ్చ కావ్యపురస్సరో నట వ్యాపారః. సైవ చ సంవిత్పరమార్థతో రసః. త దేవం మూలం బీజస్థానీయః కవిగతో రసః కవి ర్హి సామాజికతుల్య ఏవ . తతో వృక్షస్థానీయం కావ్యమ్ తత్ర పుష్పాదిస్థానీయో ఽభినయాదినట వ్యాపారః తత్ర ఫలస్థానీయః సామాజికరసాస్వాదః. తేన రసమయ మేవ విశ్వమ్. 1.294

తస్మా ద స్తి శాంతో రసః తత్ర సర్వరసానాం శాంతప్రాయ ఏ వాస్వాదో, వ విషయేభ్యో విపరివృత్త్యా 1 339

ఏవం తే నవైవ రసాః. 1 341

అభినయస్య ద్వివిధా ఇతి కర్తవ్యతా -లోక ధర్మీ, నాట్యధర్మీ చ. ఆద్యా ద్వివిధా- చిత్తవృత్త్యర్పకత్వే నానుభావస్య, కేవల బాహ్యా వయవరూపా వా. నాట్యధ ర్మ్యపి ద్విధా- నాట్యోపయోగ మూల భూత కైశికీసంపాదనోచితా లౌకికశోభాహేతుః, కాచి త్వంశేన లోక ముపజీవతి . నటసమయమాత్రరూపా నాట్యధర్మీ, సమయ స్యాకించి త్కరస్య కల్పనే ప్రయోజనాభావాత్. II 25-26

కావ్యనాట్యయో ర్హి లోకానుసారిత్వం వా వైచిత్ర్యయోగిత్వం వా ధర్మః II 215

# కుంతక మతము

కుంతకుడు పదవ శతాబ్దమునకు చెందినవాడు భామహ, ఉద్భటాది అలం కారికులను అనుసరించిన కుంతకుడు అభినవగుప్తుని సమకాలికుడు.

కుంతకుడు తన గ్రంథమును కావ్యాలంకార మన్నాడు సాలం కృత శబ్దార్థముల సంయోజనమున వే కావ్యత్వము సిద్ధించు నని పల్కి, మొదటి ఉన్మేషమున పదకొండవ కారికలో వక్రోక్తిని నిర్వచించెను వక్రోక్తి అనగా వైదగ్ధ్య భంగీభణితి అన్నాడు ప్రసిద్ధాభిధానముకన్న భిన్న మైన వక్రోక్తి కవికర్మ కౌశలమువలన బయల్వెడలు పదవిన్యాసము వక్రోక్తి కావ్యమునకు ఆత్మవంటిది ఇది కవి వ్యాపారము నాశ్రయించు కొని వచ్చునది

లోకోత్తర మగు చమత్కారమును తెచ్చు వైచిత్ర్యము ఒకటి కల దని, అది కావ్యమునకు గల అపూర్వాలంకార మని మొదటనే నిర్దేశించి నాడు కావ్యామృత రసాస్వాదము చతుర్వర్గ ఫలాస్వాదముకన్న మిన్న. ఈ అనుభూతి సాలంకృత కావ్యమున కల్గునది శబ్దార్థముల కలయిక కావ్యము శబ్దము అర్థము అనునవి రెండుగా ఉండక, ఏకరూపముగ కన్పించుటయే విచిత్ర మగు కావ్యోక్తి అందుచే శబ్దమునే కావ్య మని, అర్థమునే కావ్య మని ఎంచువారు సరి యైన కావ్య లక్షణము నీయలేరు వీని ఏకత్వ బంధమే ఆహ్లాదకారి ఈ ఏకత్వము విచిత్ర మగు వక్రోక్తి ద్వారా వచ్చునది శబ్దార్థముల సమ్మేళనమే సాహిత్యము.

కావ్యమున గల శబ్దార్థముల సంబంధమును తెలుపు పారిభాషిక శబ్దముగా సాహిత్య శబ్దమును కుంతకుడు ఉపయోగించెను శబ్దార్థముల సహితత్వము సాహిత్యము. ఇది నిత్య సంబంధము నిసర్గసిద్ధ మగు శబ్దార్థ సంబంధము కవి వ్యాపార వశమున విశిష్ట మైన సాహిత్య మగుచున్నది ఈ విధమగు సాహిత్యము వాక్య ప్రమాణాతిరిక్తము ఇచట రసాభి వ్యక్తికి శబ్దము అర్థము అనునవి ఒకదానితో నొకటి పోటీపడుచున్నట్లు కనిపించును ఔచిత్యమువలె ఈ సాహిత్యముకూడ అనేక స్థలములలో

కలదు. అన్ని గుణములలో సమముగా ఉన్న శబ్దము, అర్థము అనునవి స్నేహితులవలె కలసి మెలసి ఉండి పరస్పర శోభాహేతువు లగుచున్నవి. ఒక శబ్ద మింకొక శబ్దముతోను ఒక అర్థము వేరొక అర్థముతోను సంవలితము లగునపుడే కవి ప్రతిభా ప్రౌఢి ప్రాధాన్యము నందగలదు

అనేక శబ్దములు ఒకే అర్థము నీయగల్గియున్నను కవి తన అభిప్రాయ ద్యోతక మగు ఒక్క శబ్దమునే ప్రయోగించును ఇట్టి శబ్దమునే కావ్య మార్గమున శబ్ద మందురు ఇదే రీతిగా సహృదయుల కాహ్లాదమును చేకూర్చు పరిస్పందమును కలుగజేయు అర్థమే సరియైన అర్థము విశిష్టార్థమును ప్రతిపాదించు విశిష్ట శబ్దార్థములలో వక్రత కలదు కవి అభిప్రాయ విశేషమును తెలియపరచు శక్తి కల్గియున్నదే వాచక శబ్దము విశిష్ట రూపమున చెప్పుటకు యోగ్యమగు పదార్థ స్వరూపమున్నను, ఈ విశేషార్థమును ప్రతిపాదించుటకు సమర్థ మగు విశేషణము లేనిచో కావ్య శోభకు హాని చేకూరును

అలంకార్యముగను, అలంకరణీయముగను ఉన్న శబ్దార్థములను శోభాతిశయమును తెచ్చు అలంకరణముతో యోజింపవలెను ఈ అలంకరణమే వక్రోక్తి కవికర్మ కౌశల మగు మార్గమున శబ్దార్థములను యోజించుట వక్రోక్తి. ఇది విచిత్రమగు అభిధ దీనినే అసాధారణ మైన శైలి అందురు ఈ విచిత్రాభిధలో అంతర్లీనముగా నున్న వక్రత్వ మనబడు వక్ర భావమును వైచిత్ర్య మనవచ్చును దీనిని శాస్త్రాది ప్రసిద్ధ శబ్దార్థోపనిబంధ వ్యతిరేకి' అని ప్రసిద్ధ ప్రస్థాన వ్యతిరేకి ' అని, ' అతిక్రాంత ప్రసిద్ధ వ్యవహార సరణి అని కూడ చెప్పినాడు సామాన్య వ్యవహారమున కన్పించు ప్రయోగ సరణికన్న భిన్న మైన దిది. వక్రోక్తి తెచ్చు వైచిత్ర్యమే కావ్యమున గల కావ్యత్వము ఇది కవి ప్రతిభవలన వచ్చు విశిష్ట శబ్దార్థప్రయోగ రచనలో కన్పించు విశేషము కనుక వక్రత కవి వ్యాపారము కాక కవి వ్యాపార వక్రత్వము అనునది కవిత్వ హేతువు. దీనిని భణితి ప్రకార మని ఉక్తి వైచిత్ర్యమని అనవచ్చును.

కేవలము స్వభావోక్తి గల కావ్యమును కుంతకుడు కావ్యముగా గ్రహింప లేదు వక్రోక్తి వైచిత్ర్యమున అతిశయోక్తి దాగియున్నది కావ్యమున వైచిత్ర్యమున్నది లేనిది తెలిసికొనుటకు అది కావ్య విదు

లకు ఆహ్లాదమును కలిగించునదా, లేదా, అను విషయమును తేల్చికొన వలెను కావ్యవిదులే సహృదయులు వీరిని "తద్విదు" లనినాడు. సాలంకృత శబ్దార్థ సహితత్వమును కావ్యముగా గ్రహించి అలంకారముల కన్నిటికి ప్రాణమువంటి దీవక్రోక్తి అనినాడు కావుననే వక్రోక్తిని సకలాలంకార సామాన్య మనవచ్చును. దీని రూపాంతరములే అలంకారములు.

కవి వ్యాపారజన్య మగు వక్రోక్తి అనేక విధములుగా కన్పించ వీలున్నది వర్ణ విన్యాసమున, ప్రత్యయమున, ప్రాతిపదికయందు, వాక్య నిర్మాణమున ప్రకరణమున ప్రబంధమున వక్రోక్తి భాసింప గలదు పూర్వ విమర్శకులు చెప్పిన వృత్తులను వర్ణ విన్యాస వక్రతగా గ్రహించినాడు కవుల శక్తి వ్యుత్పత్తి అభ్యాసము అనువానిని ఆశ్రయించుకొనిన వగుటచే రీతులను దేశ ధర్మములక్రింద నిర్వచింప వీలు లేదు కవి ప్రస్థాన భేదములకు కారణము కవి స్వభావములలో కలవు

కొందరు కవులు సుకుమార మార్గమును, ఇతరులు విచిత్ర మార్గమును అవలంబించిరి వస్తు స్వభావమునకు ప్రాధాన్యము నొసగుటచే సుకుమార మార్గమున కవి కౌశలము సహజముగా భాసించును విచిత్ర మార్గమున కవి కౌశలము యత్న పూర్వకముగా కన్పించును మొదటి దానిలో సాతిశయ శబ్దరచన ఉండగలదు రెండవ దానిలో అలంకరణము ప్రధానము రెంటియందును ప్రతీయమానత అను ధ్వని ఒక అంగమే స్వభావ నిరూపణలో రసము అంగముగా నున్నది సుకుమార మార్గమున. రెండవ మార్గమున రసాకూత మగు అలంకరణ ముండును మాధుర్యము, ప్రసాదము, లావణ్యము, ఆభిజాత్యము అనునవి సుకుమారమార్గ లక్షణములు రెండవ దానిలో కన్పించు ఈ లక్షణములకు వేరు విధమున నిర్వచనముల నిచ్చినాడు ఈ రెంటికిని మధ్య నున్నది మధ్యమ మార్గము ఈ మూటి యందు ఔచిత్యము, సౌభాగ్యము, అనునవి సమాన ధర్మములు.

కుంతకుడు రసమును, భావమును విశేషముగా చెప్పలేదు. అలంకారముల విషయమున ప్రకరణ వక్రతయందు, ప్రబంధ వక్రతలోను రస వివేచన చేసినాడు వక్రోక్తిలోని అంతర్భావమే రసము రసవదాదులు

అలంకారములు కావని, అలంకార్యములే అని ఇతని మతము రస స్వభా వాలంకారముల కన్నిటికిని కవి కౌశలమే జీవనము

కుంతకుని ఉపచార వక్రతలో ధ్వని లక్షణము లన్నియు స్వీకరింప బడినవి ఇది రూపకాద్యలంకారములలో ప్రధానముగా కన్పించును అత్యంత భిన్నము లైన వానిలో కొద్ది సాదృశ్య మైన కన్పించినపుడు, ఈ సాదృశ్యముద్వారా భేదము కవివ్యాపార వశమున స్థగిత మైనపుడు ఉపచార వక్రత రాగలదు అతచ్ఛబ్దస్య తచ్ఛబ్దే నాభిధానం ఉపచారః" అని న్యాయవార్తిక మీ అర్థమును చెప్పుచున్నది. ఈ ఉపచార వక్రతను ధ్వనివాదులు లక్షణామూలధ్వనిగా గ్రహింతురు సుకుమార విచిత్ర మార్గములో ధ్వనిని అంగీకరించి, పదవక్రతలో రూఢివైచిత్ర్య వక్రతను చెప్పి పర్యాయ వక్రతను స్వీకరించిన కుంతకుడు ధ్వనిని పూర్తిగా త్రోసి వేయ లేదు. ఆనంద వర్ధనుని అత్యంత తిరస్కృత వాచ్యధ్వనిని ఉపచార వక్రతగను అర్థాంతర సంక్రమిత వాచ్యధ్వనిని రూఢి వైచిత్ర్య వక్రత గను, శబ్దశక్తి మూలధ్వనిని పర్యాయ వక్రతగను చెప్పినాడు వాక్య వక్రతలో ప్రతీయమానత్వము నంగీకరించినాడు వస్తుధ్వనిని అలంకార ధ్వనిని కూడ వక్రతలో అంతర్భాగముగా గ్రహించినాడు

విచ్ఛిత్తి వైచిత్ర్యము చారుత్వము మనోజ్ఞత్వము, చమత్కా రము, హృద్యత్వము మొదలగు పదములను సాహిత్య శాస్త్రమున సుస్థిర ముగా నెలకొల్పినవాడు కుంతకుడు

## వక్రోక్తి జీవితమ్

లోకోత్తర చమత్కారకారి వైచిత్ర్య సిద్ధయే
కావ్య స్యాయ మలంకారః కోఽ ప్యపూర్వో విధీయతే 1 42

శబ్దార్థౌ సహితౌ వక్రకవివ్యాపారశాలిని
బంధే వ్యవస్థితౌ కావ్యం తద్విదాహ్లాదకారిణి 1 7

శబ్దార్థౌ కావ్యం; వాచకో వాచ్యం చేతి ద్వౌ సంమిలితౌ కావ్యమ్. ద్వా వేక మితి విచిత్రైవోక్తిః తేన యత్కేషాంచిన్మతం

కవికౌశల కల్పిత కమనీయాతిశయః శబ్ద ఏవ కేవలం కావ్య మితి. కేషాంచి ద్వాచ్య మేవ రచనావైచిత్ర్య చమత్కారకారి కావ్య మితి. పక్షద్వయ మపి నిరస్తం భవతి. తస్మాత్ ద్వయో రపి ప్రతితిల మివ తైలం, తద్విదాహ్లాద కారిత్వం వర్తతే, న పున రేకస్మిన్.
( .7 వృత్తి పు 18)

న శబ్ద స్యైవ రమణీయతా విశిష్టస్య కేవలస్య కావ్యత్వం, నాపి వ్యర్థ స్యేతి. త దిద ముక్తం–

రూపకాది రలంకార స్త థాన్యై ర్బహుధోదితః
న కాంత మపి నిర్భూషం విభాతి వనితాముఖమ్. (భామహ 1 15)

తేన శబ్దార్థౌ ద్వౌ సమ్మిలితౌ కావ్య మితి స్థితమ్.
.. సహితౌ సహితభావేన సాహిత్యే నావస్థితౌ. (పు. 24 25)

విశిష్ట మే వేహ సాహిత్య మభిప్రేతమ్ కీదృశం? వక్రతా విచిత్ర గుణాలంకారసంపదాం పరస్పర స్పర్ధాధిరోహః (పు 25)

శబ్దో వివక్షితార్థైకవాచకో ఽన్యేషు సత్స్వపి
అర్థః సహృదయాహ్లాదకారి స్వస్పందసుందరః 1.9

కవి వివక్షిత విశేషాభిధానక్షమత్వ మేవ వాచకత్వ లక్షణమ్.
(పు. 41)

విశేషాభిధానాకాంక్షిణః పునః పదార్థస్వరూపస్య తత్ ప్రతిపాదన పర విశేషణశూన్యతయా శోభాహాని రుత్పద్యతే. (పు. 42)

ఉభా వేతా వలంకార్యౌ తయోః పున రలంకృతిః
వక్రోక్తి రేవ వైదగ్ధ్యభంగీభణితి రుచ్యతే 1 10

వక్రోక్తిః ప్రసిద్ధాభిధాన వ్యతిరేకిణీ విచిత్రైవాభిధా. కీదృశీ? వైదగ్ధ్యభంగీభణితిః. వైదగ్ధ్యం విదగ్ధభావః, కవికర్మకౌశలం తస్యభంగీ విచ్ఛిత్తిః తయా భణితిః. విచిత్రైవాభిధా వక్రోక్తి రి త్యుచ్యతే త దిద మత్ర తాత్పర్యం– యత్ శబ్దార్థౌ పృథ గవస్థితౌ కేనాపి వ్యతిరిక్తే

వాలంకరణేన యోజ్యతే. కింతు వక్రతావైచిత్ర్యయోగితయాభిధాన మేవానయో రలంకారః తస్యైవ శోభాతిశయ కారిత్వాత్.
(పు. 51-52)

న వాచ్యవాచక లక్షణ శాశ్వతసంబంధ నిబంధనం వస్తుతః సాహిత్య ముచ్యతే. యస్మా దేతస్మిన్ సాహిత్యశబ్దే నాభిధీయమానే కవి కల్పనోపరచితాని గాంకుటాది వాక్యాని అసంబద్ధాని శాకటికాది వాక్యాని చ సర్వాణి సాహిత్యశబ్దే నాభిధీయేరన్ తేన పదవాక్య ప్రమాణ వ్యతిరిక్తం కి మపి తత్త్వాంతరం సాహిత్య మితి విభాగోఽపి న స్యాత్... య దిదం సాహిత్యం నామ త దేతావతి నిఃసీమని సమయా ధ్వని సాహిత్యశబ్దమాత్రే ణైవ ప్రసిద్ధమ్ న పున రేతస్య కవికర్మ కౌశల శ్లాఘాధిరూఢిరమణీయ స్యాద్యాపి కశ్చి దపి విపశ్చి దయ మస్య పరమార్థ ఇతి మనాఙ్మాత్ర మపి విచారపదవీ మవతీర్ణః త దద్య సర స్వతీహృదయారవింద మకరంద బిందుసందోహ సుందరాణాం సత్కవి వచసా మంతరామోదం మనోహరత్వేన పరిస్ఫుర దేతత్ సహృదయషట్పదగోచరతాం నీయతే.
(పు 58)

· సాహిత్య మనయోః శోభాశాలితాం ప్రతి కా వ్యసౌ
అన్యూనాతిరిక్తత్వ మనోహారి ణ్యవస్థితిః. 1 17

సహితయో ర్భావః సాహిత్యమ్ అనయోః శబ్దార్థయోః యా కా వ్యలౌకికీ చేతన చమత్కారకారితాయాః కారణం అవస్థితిః విచిత్రైవ విన్యాసభంగి కీదృశీ? అన్యూనాన తిరిక్తత్వ మనోహారిణీ, పరస్పర స్పర్ధిత్వరమణీయా. యస్యాం ద్వయో రేకతరస్యాపి న్యూనత్వం నికర్షో న విద్యతే, నా ప్యతిరిక్తత్వ ముత్కర్షో వా స్తీ త్యర్థః శోభా సౌందర్య ముచ్యతే. తయా శాలతే శ్లాఘతే యః స శోభాశాలీ తస్య భావః శోభాశాలితా, తాం ప్రతి సౌందర్యశ్లాఘితాం ప్ర తీత్యర్థః. సైవ చ సహృదయాహ్లాదకారితా. తస్యాం స్పర్ధిత్వేన యాఽసా వవస్థితిః పరస్పరసామ్య సుభగ మవస్థానం సా సాహిత్య ముచ్యతే తత్ర వాచకస్య వాచకాంతరేణ వాచ్యస్య వాచ్యాంతరేణ సాహిత్య మభిప్రేతమ్.
(పు. 60-61)

మార్గానుగుణ్యసుభగో మాధుర్యాదిగుణోదయః
అలంకరణవిన్యాసో వక్రతాతిశయాన్వితః
వృత్త్యౌచిత్యమనోహారి రసానాం పరిపోషణమ్
స్పర్ధయా విద్యతే యత్ర యథా స్వ ముభయో రపి.
సా కా వ్యవస్థితి స్తద్విదానంద స్పందసుందరా
పదాదివాక్పరిస్పందసారః సాహిత్య ముచ్యతే (పు. 61-62)

కవివ్యాపార వక్రత్వప్రకారాః సంభవంతి షట్
ప్రత్యేకం బహవో భేదా స్తేషాం విచ్ఛిత్తిశోభినః 1 18

వర్ణవిన్యాసవక్రత్వం పదపూర్వార్ధవక్రతా
వక్రతాయాః పరోఽ ప్యస్తి ప్రకారః ప్రత్యయాశ్రయః. 1 19

వాక్యస్య వక్రభావోఽ న్యో భిద్యతే యః సహస్రధా
య త్రాలంకారవర్గోఽ సౌ సర్వోఽ ప్యంతర్భవిష్యతి. 1 20

వక్రభావః ప్రకరణే ప్రబంధే వా స్తి సాదృశః
ఉచ్యతే స హజాహార్యసౌకుమార్యమనోహరః. 1 21

వాచ్యవాచకసౌభాగ్య లావణ్య పరిపోషకః
వ్యాపారశాలీ వాక్యస్య విన్యాసో బంధ ఉచ్యతే 1 22

లావణ్యం సన్నివేశసౌందర్యమ్. (పు. 95)

వాచ్య వాచక వక్రోక్తి త్రిత యాతిశయో త్తరమ్
తద్విదాహ్లాదకారిత్వం కి మ ప్యామోదసుందరమ్. 1 23

కిమ ప్యవ్యపదేశ్యం సహృదయహృదయసంవేద్యమ్. ఆమోదః సుకుమారవస్తుధర్మః రంజకత్వం నామ. తేన సుందరం రంజకత్వ రమణీయమ్. (పు 97)

సంప్రతి తత్ర యే మార్గాః కవిప్రస్థానహేతవః
సుకుమారో విచిత్రశ్చ మధ్యమ శ్చోభయాత్మకః 1 24

కవిస్వభావభేద నిబంధనత్వేన కావ్యప్రస్థానభేదః సమంజసతాం గాహతే యద్యపి కవిస్వభావభేద నిబంధనత్వా దనంత భేదభిన్నత్వ మనివార్యం తథాపి పరిసంఖ్యాతు మశక్యత్వాత్ సామాన్యేన త్రైవిధ్య మేవోపపద్యతే (పు. 101-2)

అమ్లాన ప్రతిభోద్భిన్న నవశబ్దార్థబంధురః
అయత్నవిహిత స్వల్పమనోహారి విభూషణః 1 25

భావస్వభావప్రాధాన్య న్యక్కృతాహార్యకౌశలః
రసాదిపరమార్థజ్ఞ మనః సంవాద సుందరః 1 26

అవిభావితసంస్థాన రామణీయకరంజకః
విధివైదగ్ధ్యనిష్పన్న నిర్మాణాతిశయోపమః 1 27

యత్కించ నాపి వైచిత్ర్యం తత్సర్వం ప్రతిభోద్భవమ్
సౌకుమార్యపరిస్పందస్యంది యత్ర విరాజతే. 1 28

సుకుమారాభిధః సోఽయం యేన సత్కవయో గతాః
మార్గేణోత్ఫుల్లకుసుమకాననే నేవ షట్పదాః. 1 29

(సుకుమార) మార్గేణ సత్కవయః కాలిదాసప్రభృతయో గతాః (ప్రయాతాః), తదాశ్రయేణ కావ్యాని కృతవంతః. (పు. 1(5)

విచిత్ర (మార్గం) లక్షయతి —

ప్రతిభా ప్రథమోద్భేదసమయే యత్ర వక్రతా
శబ్దాభిధేయయో రంతః స్ఫురతీవ విభావ్యతే 1.34

అలంకారస్య కవయో యత్రాలంకరణాంతరమ్
అసంతుష్టా నిబధ్నంతి హారాదే ర్మణిబంధవత్.... 1. 5

యత్రాన్యథా భవత్సర్వ మన్యథైవ యథారుచి
భావ్యతే ప్రతిభోల్లేఖమహత్వేన మహాకవేః 1.39

ప్రతీయమానతా యత్ర వాక్యార్థస్య నిబధ్యతే
వాచ్యవాచకవృత్తిభ్యాం వ్యతిరిక్తస్య కస్యచిత్ 1.40

స్వభావః సరసాకూతో భావానాం యత్ర బధ్యతే
కేనాపి కమనీయేన వైచిత్ర్యే ణోపబృంహితః 1.41

విచిత్రో యత్ర వక్రోక్తివైచిత్ర్యం జీవితాయతే
పరిస్ఫురతి య స్యాంతః సా కావ్యతిశయాభిధా 1.42

సో౽తి దుఃసంచరో యేన విదగ్ధకవయో గతాః
ఖడ్గధారాపథే నేవ సుభటానాం మనోరథాః. 1 43

అంజసేన స్వభావస్య మహత్త్వం యేన పోష్యతే
ప్రకారేణ తదౌచిత్య ముచితాఖ్యానజీవితమ్. 1.53

యత్ర వక్తుః ప్రమాతు ర్వా వాచ్యం శోభాతిశాయినా
ఆచ్ఛాద్యతే స్వభావేన తద ప్యౌచిత్య ముచ్యతే. 1.54

ఇత్యుపాదేయవర్గే౽స్మిన్ యదర్థం ప్రతిభా కవేః
సమ్య క్సంరభతే తస్య గుణః సౌభాగ్య ముచ్యతే. 1.55

రసేన వర్తతే తుల్యం రసవత్త్వవిధానతః
యో౽లంకారః సరసవత్ తద్విదాహ్లాదనిర్మితేః 3 15

నూతనోపాయనిష్పన్న నయవర్త్మోపదేశినాం
మహాకవి ప్రబంధానాం సర్వేషా మస్తి వక్రతా. 4.26

---

# క్షేమేంద్రుడు

ఈతడు కాశ్మీరకుడు. క్రీ శ 9ˊ0–1070 సంవత్సరములలో వర్ధిల్లినవాడు. ఈతని తండ్రి ప్రకాశేంద్రుడు శైవుడు చిన్నతనమున క్షేమేంద్రుడు అభినవగుప్త, గంగక సోమపాదాది గురువులకడ విద్య లభ్యసించినాడు సోమపాదుని వలన నితనికి వైష్ణవాభిమానము కలిగినది బౌద్ధ ధర్మము నెడ కూడ నీతని కభిమాన మున్నట్లు కానవచ్చును. వ్యాసదాసు డను నామాంతరము కల యీతడు బహు గ్రంథములు రచించినాడు

క్షేమేంద్రుడు ఔచిత్య ప్రస్థానమును ప్రస్ఫుటము చేసినను, పూర్వులు కొందరు దీనిని గమనింపక పోలేదు భరతుని నాట్య శాస్త్రమున యథా భావ రసావస్థం అను వాక్యార్థము ఔచిత్యమును సూచించును య అను శ్లోకము ఔచిత్యమునకు దృష్టాంతము. భామహాచార్యుని "సన్నివేశ విశేషాత్ దురుక్త మపి శోభతే అను వాక్యార్థము, దండికృత "సముదాయార్థ శూన్యం త దపార్థ మితీష్యతే ఉన్మత్త మత్త బాలానా ముక్తే రన్యత్ర దుష్యతి" అనునదియు ఔచిత్యమును సూచించును.

ఔచిత్య మను శబ్దమును తొలిసారి రు దటు డుపయోగించినాడు.

"ఏతాః ప్రయత్నా దధిగమ్య సమ్యక్
ఔచిత్య మాలోచ్య తథార్థ సంస్థమ్"

'ఇతి యమక మశేషం సమ్య గాలోచయద్భిః
సుకవిభి రభియుక్తైః వస్తు చౌచిత్యవిద్భిః.'

ఆనందవర్ధనాచార్యుడు రసమున కౌచిత్యము ప్రాణముగా గ్రహించినాడు

"తన్నియమే హేతు రౌచిత్యం వక్తృ వాచ్యయోః"

"విషయాశ్రయ మ ప్యన్య దౌచిత్యం తాం నియచ్ఛతి'

"ఏత ద్యథోక్త మౌచిత్య మేవ తస్యా నియామకమ్.

అనౌచిత్యాదృతే నాన్య ద్రసభంగస్య కారణమ్. '
"ప్రసిద్ధౌచిత్య బంధస్తు రస స్యోపనిషత్పరా."
'వాచ్యానాం వాచకానాం చ య దౌచిత్యేన యోజనమ్
రసాదివిషయే నైత త్కర్మ ముఖ్యం మహాకవేః."

కుంతకుడు తన వక్రోక్తి జీవితములో అనౌచిత్యమునకు రెండు లక్షణములు చెప్పినాడు

అ జసేన స్వభావస్య మహత్త్వం యేన పోష్యతే
ప్రకారేణ తదౌచిత్య ముచితాఖ్యాన జీవనమ్.

"యత్ర వక్తుః ప్రమాతుర్వా వాచ్యం శోభాతి శాయినా
అచ్ఛాద్యతే స్వభావేన తద ప్యౌచిత్య ముచ్యతే "

మహిమభట్టు వ్యక్తి వివేకములో శబ్దగతానౌచిత్యమును వివరించినాడు: "ఇహ ఖలు ద్వివిధ మనౌచిత్య ముక్తం, అర్థ విషయం, శబ్ద విషయం చేతి ఏత స్య చ వివక్షిత రసాది ప్రతీతి విఘ్న విధాయిత్వం నామ సామాన్య లక్షణం త ఏతే విధేయా విమర్శాదయో దోషా ఇత్యుచ్యంతే '

కావ్యాత్మ యేది యను విషయమున అలంకారికులలో భిన్న మతము లున్నవి అలంకార, గుణ, రీతి, వక్రోక్తి, ధ్వని, అనుమితి, రసము—వీనిలో నేది కావ్యాత్మ యనుకొన్నను ఔచిత్య మున్నప్పుడే యుక్తఫల ముండును

క్షేమేంద్రుడు ఔచిత్య మిట్టి దని నిరూపించినాడు.

ఉచితస్థాన విన్యాసా దలంకృతి రలంకృతిః
ఔచిత్యా దచ్యుతా నిత్యం భవం త్యేవ గుణాగుణాః

అలంకారా స్త్వలంకారా గుణా ఏవ గుణా స్సదా
ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితమ్.

కిం త దౌచిత్య మి త్యాహ

ఉచితం ప్రాహు రాచార్యాః సదృశం కిల యస్య యత్
ఉచితస్య చ యో భావ స్త దౌచిత్యం ప్రచక్షతే.

య త్కిల య స్యానురూపం తదుచిత ముచ్యతే తస్య భావ మౌచిత్యం కథయంతి

పద వాక్య ప్రబంధార్థ గుణ అలంకార, రస రససంకర, క్రియాపద, కారక, లింగ వచన, విశేషణ, ఉపసర్గ, నిపాత కాల, దేశ, కుల, వ్రత, త త్త్వ సత్వ అభిప్రాయ స్వభావ సారసంగ్రహ ప్రతిభ, అవస్థ, విచార నామ ఆశీర్వచన, ఔచిత్యము లిందు (29) ఉదాహరణ, ప్రత్యుదాహరణ పూర్వకముగా వివరింపబడినవి.

ఈ గ్రంథము కారికలుగా రచింపబడినది. ప్రతి సందర్భమునకు కొలదిగా వివరణ మిచ్చుచు, అనేక కవుల పద్యములను ఉదాహరించినాడు. ప్రత్యుదాహరణములుగా తన పద్యములనే యిచ్చిన ధీరుడు ఆరోగ్య వంతుడు క్షేమేంద్రుడు

ఉదాహరణముగా కాళిదాసుని పద్యము

బాలేందు వక్రా ణ్యవికాసభావా
ద్బభుః పలాశా న్యతి లోహితాని
సద్యో వసంతేన సమాగతానాం
నఖక్షతా నీవ వనస్థలీనామ్.

ప్రత్యుదాహరణముగా కాళిదాసుని శ్లోకము

వర్ణ ప్రక ర్షే సతి కర్ణికారం
దునోతి నిర్గంధతయా స్మ చేతః
ప్రాయేణ సామగ్ర్య విధౌ గుణానాం
పరాఙ్ముఖీ విశ్వసృజః ప్రవృత్తిః

